## మా వద్దవిక్రయమునకు సిద్ధముగనుండు పుస్తకముల వివరము.

| | క్రయం. | | | పోస్టేజి. | | |
|---|---|---|---|---|---|---|
| | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
| కృష్ణయజుర్వేదము ప్రథమప్రపాఠకము (మొదటిఅష్టకము) శ్రీవిద్యారణ్యభాష్యసహితము. బైండు ప్రతి ౧కి. | ౧౧ | ౦ | ౦ | ౦ | ౧౦ | ౦ |
| అష్టోత్తరశతోపనిషత్తులు | ౮ | ౦ | ౦ | ౦ | ౯ | ౦ |
| కాలమాధవీయము (ధర్మశాస్త్రము.) | ౧ | ౪ | ౦ | ౦ | ౨ | ౦ |
| మహాన్యాసము | ౦ | ౪ | ౦ | ౦ | ౦ | ౬ |
| శ్రీసూక్తభాష్యము | ౦ | ౪ | ౦ | ౦ | ౦ | ౬ |
| వ్రతచూడామణి (ఇది ౪౧ వ్రతములుగలది) | ౨ | ౦ | ౦ | ౦ | ౪ | ౦ |
| అద్వైతపాఠవిశిష్టశ్రీమద్రామాయణము | ౨ | ౦ | ౦ | ౦ | ౬ | ౦ |
| జాతకాలంకారము (సంస్కృతాంధ్రవ్యాఖ్యానవిశిష్టము.) | ౦ | ౧౨ | ౦ | ౦ | ౧ | ౦ |
| యాజుషప్రయోగచింతామణి (షోడశకర్మలు) | ౨ | ౦ | ౦ | ౦ | ౪ | ౦ |
| గీతాభాష్యము (శంకరకృతము) | ౧ | ౮ | ౦ | ౦ | ౦ | ౦ |
| వేంకటేశ్వరస్తోత్రకదంబము | ౦ | ౪ | ౦ | ౦ | ౦ | ౬ |
| సప్తర్షికృతరామస్తోత్రము | ౦ | ౦ | ౬ | ౦ | ౦ | ౬ |
| మేఘసందేశము-సవ్యాఖ్యానము | ౦ | ౨ | ౦ | ౦ | ౦ | ౬ |
| శృంగారతరంగిణి (శుద్ధభాణము) | ౦ | ౪ | ౦ | ౦ | ౦ | ౬ |
| పంచబాణవిజయము | ౦ | ౪ | ౦ | ౦ | ౦ | ౬ |
| దశాభుక్తిచంద్రిక | ౧ | ౪ | ౦ | ౦ | ౧ | ౦ |
| నరసభూపాలీయము (అలంకారశాస్త్రము) | ౦ | ౧౨ | ౦ | ౦ | ౧ | ౦ |
| గణపతిసహస్రనామస్తోత్రము | ౦ | ౨ | ౦ | ౦ | ౦ | ౬ |
| కాళిదాసప్రహసనము | ౦ | ౨ | ౦ | ౦ | ౦ | ౬ |

మదరాస్.

కృష్ణమ్మనాయుడు అగ్రహారములో నివసించు
ములుకుట్ల-రామలింగశాస్త్రిలు.

శ్రీరస్తు.

విషయానుక్రమణికా

ఏతద్విషయానుక్రమణికాసమాప్తా



# శ్రీరస్తు.

## యాజుషప్రయోగచింతామణిప్రారంభః.

### విఘ్నేశ్వరపూజా.

శ్రీగురుభ్యోనమః.

హరిః - ఓం - శుక్లాంబరధరంవిష్ణుంశశివర్ణంచతుర్భుజం। ప్రసన్నవదనంధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే॥ ౧ ॥ తదేవలగ్నంసుదినంతదేవ తారాబలంచంద్రబలంతదేవ। విద్యాబలం దైవబలం తదేవలక్ష్మీపతేతేంఘ్రియుగంస్మరామి ॥ ౨ ॥ సుముహూర్తమస్తు. సుప్రతిష్ఠితమస్తు॥ దేవీంవాచమజనయంతదేవాస్తాం విశ్వరూపాఃపశవోవదంతి। సానోమంద్రేషమూర్జందుహానాధేనుర్వాగస్మానుపసుష్టుతైతు ॥ సుముహూర్తమస్తు. సుప్రతిష్ఠితమస్తు॥ కళ్యాణాద్భుతగాత్రాయకామితార్థప్రదాయినే। శ్రీమద్వేంకటనాథాయ శ్రీనివాసాయమంగళం। యత్రయోగీశ్వరఃకృష్ణోయత్రపార్థోధనుర్ధరః। తత్రశ్రీర్విజయోభూతిర్ధ్రువానీతిర్మతిర్మమ॥ ౩ ॥ స్మృతేసకలకళ్యాణభాజనంయత్రజాయతే। పురుషస్తమజంనిత్యం వ్రజామిశరణంహరిం ॥ ౪ ॥ సర్వదాసర్వకార్యేషు నాస్తితేషామమంగళం। యేషాంహృదిస్థోభగవాన్మంగళాయతనంహరిః ॥ ౫ ॥ లాభస్తేషాంజయస్తేషాం కుతస్తేషాంపరాభవః। యేషామిందీవరశ్యామో హృదయస్థోజనార్దనః ॥ ౬ ॥ ఆపదామపహర్తారం దాతారంసర్వసంపదాం। లోకాభిరామంశ్రీరామం భూయోభూయోనమామ్యహం॥౭॥ సర్వమంగళమాంగల్యేశివేసర్వార్థసాధికే। శరణ్యేత్ర్యంబకేదేవి నారాయణినమోస్తుతే॥ ౮ ॥ శ్రీలక్ష్మీనారాయణాభ్యాంనమః। ఉమామహేశ్వరాభ్యాంనమః। వాణీహిరణ్యగర్భాభ్యాంనమః। శచీపురందరాభ్యాంనమః। అరుంధతీవసిష్ఠాభ్యాంనమః। సీతారామాభ్యాంనమః। సర్వేభ్యో మహాజనేభ్యోనమః ఉత్తిష్ఠంతు...సమారభే। ప్రాణానాయమ్య। ఏవంవిశిష్టేశుభాభ్యుదయముహూర్తే శ్రీమాన్ గోత్రఃనామధేయః శ్రీమతః గోత్రస్య నామధేయస్య

ఉపాత్తసమస్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం ప్రారిప్సితకర్మకరిష్య
మాణ స్తదంగత్వేన దదాదౌశుద్ధ్యర్థం వృద్ధ్యర్థం శాంత్యర్థ మభ్యుద
యార్థంచ మహాజనైస్సహ స్వస్తిపుణ్యాహవాచనంకరిష్యే । ఆదౌనిర్వి
ఘ్నేనపరిసమాప్త్యర్థం శ్రీమహాగణాధిపతిపూజాంకరిష్యే । తదంగకల
శారాధనంకరిష్యే । కలశస్యముఖేవిష్ణుః కంఠేరుద్రస్సమాశ్రితః। మూలే
తత్రస్థితోబ్రహ్మామధ్యేమాతృగణాస్మృతాః । కుక్షౌతుసాగరాస్సర్వేస
ప్తద్వీపావసుంధరా। ఋగ్వేదోథయజుర్వేదస్సామవేదోహ్యథర్వణః। అం
గైశ్చసహితాస్సర్వే కలశాంబుసమాశ్రితాః॥ * (ఆకలశేషుధావతి పవి
త్రేపరిషిచ్యతే । ఉక్థైర్యజ్ఞేషువర్ధతే) ఆపోవాఇదగ్ం సర్వంవిశ్వాభూ
తాన్యాపః ప్రాణావాఆపఃపశవఆపోఽన్నమాపోఽమృతమాప స్సమ్రాడా
పోవిరాడాపస్స్వరాడాపశ్ఛందాగ్ం ష్యాపోజ్యోతీగ్ం ష్యాపోయజూగ్ం
ష్యాపస్సత్యమాపస్సర్వా దేవతాఆపోభూర్భువస్సువరాపఓం। గంగేచయ
మునేకృష్ణే గోదావరిసరస్వతి । నర్మదేసింధుకావేరి జలేస్మిన్సన్నిధిం
కురు । ఆయాంతు శ్రీమహాగణాధిపతిపూజార్థం దురితక్షయకారకాః ।
కలశోదకేనపూజాద్రవ్యాణిసంప్రోక్ష్య। దేవమాత్మానంచసంప్రోక్ష్య।ఓం
అసునీతేపునరస్మాసుచక్షుఃపునః ప్రాణమిహనోధేహిభోగం । జ్యోక్ప
శ్యేమసూర్యముచ్చరంతమనుమతే మృళయానస్స్వస్తి । అమృతంవైప్రా
ణాఅమృతమాపః ప్రాణానేవయథాస్థానముపహ్వాయతే। స్థిరోభవ । వర
దోభవ। సుముఖోభవ। సుప్రసన్నోభవ । స్థిరాసనంకురు । ఓంగణా
నాంత్వాగణపతిగ్ం హవామహేకవింకవీనాముపమశ్రవస్తమం । జ్యేష్ఠరా
జంబ్రహ్మణాంబ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం। శ్రీమ
హాగణాధిపతయేనమః। ధ్యాయామి । ఆవాహయామి। సువర్ణరత్నఖచి
తసింహాసనంసమర్పయామి । పాదయోఃపాద్యంసమర్పయామి । హస్త
యోరర్ఘ్యంసమర్పయామి । శుద్ధాచమనీయం సమర్పయామి। ఓంఆ
పోహిష్ఠామయోభువస్తానఊర్జేదధాతన। మహేరణాయచక్షసే। యో
వశ్శివతమోరసస్తస్యభాజయతేహనః। ఉశతీరివమాతరః। తస్మాఅరంగ
మామవోయస్యక్షయాయజిన్వథ । ఆపోజనయథాచనః । శ్రీమహాగణాధి
పతయేనమః । శుద్ధోదకస్నానంసమర్పయామి । స్నానానంతరమాచ
మనీయంసమర్పయామి । ఓంఅభివస్త్రాసువసనాన్యర్షాభిధేనూస్సుదు

ఘాః ఫూాయమానాః। అభిచంద్రాభ ర్తవేనోహిరణ్యాః సమస్తదేశేష్వశేషేషు । శ్రీమహాగణాధిపతయేనమః । వస్త్రయుగ్మంసమర్పయామి దివ్యమాస్త్రయుగ్మధారణానంతరమాచమనీయం సమర్పయామి ।

మంపవిత్రం ప్రజాపతేర్యత్సహజంపురస్తాత్ ।ఆయుష్యమగ్య్రంప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతంబలమస్తుతేజః । శ్రీమహాగణాధిపతయేనమః । యజ్ఞోపవీతంసమర్పయామి । యజ్ఞోపవీతానంతర మాచమనీయం సమర్పయామి । శ్రీగంధంచందనోన్మిశ్రం కర్పూరేణసుసంయుతం । విలేపనంసురశ్రేష్ఠప్రీత్యర్థంప్రతిగృహ్యతాం । శ్రీమహాగణాధిపతయేనమః శ్రీగంధంసమర్పయామి । గంధస్యోపరి అలంకరణార్థమక్షతాన్ త్సమర్పయామి । పుష్పైఃపూజయామి । ఓంసుముఖాయనమః । ఓం ఏకదంతాయనమః । ఓం కపిలాయనమః । ఓంగజకర్ణకాయనమః । ఓంలంబోదరాయనమః। ఓంవికటాయనమః । ఓంవిఘ్నరాజాయనమః । ఓంగణాధిపాయనమః। ఓంధూమకేతవేనమః । ఓంగణాధ్యక్షాయనమః । ఓంఫాలచంద్రాయనమః । ఓంగజాననాయనమః । ఓంవక్రతుండాయనమః । ఓంశూర్పకర్ణాయనమః।ఓంహేరంబాయనమః। ఓంస్కందపూర్వజాయనమః।శ్రీమహాగణాధిపతయేనమః । షోడశనామపూజాం సమర్పయామి । వనస్పత్యుద్భవైర్దివ్యైర్నానాగంధైస్సుసంయుతః । ఆఘ్రేయస్సర్వ దేవానాంధూపోయంప్రతి గృహ్యతాం । శ్రీమహాగణాధి పతయేనమః । ధూపమాఘ్రాపయామి । సాజ్యంత్రివర్తి సంయుక్తం వహ్నినాయోజితం ప్రియం। గృహాణమంగళందీపం త్రైలోక్య తిమిరాపహం । భక్త్యాదీపంప్రయచ్ఛామి దేవాయపరమాత్మనే । త్రాహిమాంనరకాద్ఘోరాద్దివ్యజ్యోతిర్నమోస్తుతే। శ్రీమహాగణాధి పతయేనమః । దీపందర్శయామి । ధూపదీపానంతరమాచమనీయంసమర్పయామి । ఓంభూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం। భర్గోదేవస్యధీమహీ । ధియోయోనః ప్రచోదయాత్ । సత్యంత్వర్తేన పరిషించామి । అమృతమస్తు । అమృతోపస్తరణమసి । శ్రీమహాగణాధిపతయేనమః । యథాభాగం గుడనైవేద్యం సమర్పయామి । ఓంప్రాణాయస్వాహా ఓంఅపానాయస్వాహా । ఓంవ్యానాయస్వాహా । ఓంఉదానాయస్వాహా । ఓంసమానాయస్వాహా । మధ్యేమధ్యేపానీయంసమర్పయామి । అమృతాపిధానమసి । ఉత్తరాపోశనం

ఉపాత్తమునితత్తుయస్త్రప్రక్షాళనం సమర్పయామి । పాదప్రక్షాళనం సమర్ప
మాణ స్తదంగత్వేన యిం సమర్పయామి। పూగీఫలైశ్చకర్పూరైర్నాగవల్లీ
యాంకం * మహచ్చూర్ణసమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం। శ్రీమ
హాగణాధిపతయే నమః। తాంబూలం సమర్పయామి। తాంబూలచర్వణా
నంతరం హస్తప్రక్షాళనం సమర్పయామి। ఉత్తరనీరాజనం దర్శయామి। నీరాజనా
నంతరమాచమనం సమర్పయామి । సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణ
కః। లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః । ధూమకేతుర్గణాధ్యక్షః
ఫాలచంద్రో గజాననః । వక్రతుండశ్శూర్పకర్ణో హేరంబస్స్కందపూర్వజః।
షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి। విద్యారంభే వివాహే చ ప్ర
వేశే నిర్గమే తథా। సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య న జాయతే। శ్రీమ
హాగణాధిపతయే నమః । సువర్ణమంత్రపుష్పం సమర్పయామి । ఆత్మప్రద
క్షిణనమస్కారాంత్సమర్పయామి । వక్రతుండ మహాకాయ సూర్యకోటిస
మప్రభ। అవిఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా। మంత్రహీనం క్రియా
హీనం భక్తిహీనం గణాధిప। యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తు తే।
అనయా ధ్యానావాహనాది షోడశోపచారపూజయా భగవాన్ సర్వాత్మ
కశ్శ్రీమహాగణాధిపతిస్సుప్రీతో వరదో భవతు ॥ ఉత్తరే శుభకర్మణ్యవిఘ్నమ
స్తు । శ్రీమహాగణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి । యజ్ఞేన యజ్ఞమయ
జంత దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ । తేహ నాకం మహిమానస్సచం
తే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః। శ్రీమహాగణాధిపతిం యథాస్థానం
ప్రతిష్ఠాపయామి । ఓం తత్సత్ * సమాప్తా శ్రీవిఘ్నేశ్వరపూజా॥ *

## పుణ్యాహవాచనం.



ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ । త్వామవస్యురా
చకే। తత్త్వా యామి బ్రహ్మణా వందమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః।
అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ం స మా న ఆయుః ప్రమోషీః ॥ ఓం
భూః - వరుణమావాహయామి। ఓం భువః - వరుణమావాహయామి। ఓం సు
వః - వరుణమావాహయామి। ఓం భూర్భువస్సువః । వరుణమావాహయామి।
వరుణాయ నమః। ధ్యానాది షోడశోపచారపూజాం సమర్పయామి॥ అనయా

పూజయా వరుణః ప్రియతాం । ఓం సర్వేషు కాలేషు సమస్తదేశేష్వశేష కార్యేషు తథేశ్వరేశ్వరః । సర్వస్వరూపీ భగవాననాదిర్మమాస్తు మాంగల్యవివృద్ధయే హరిః॥

పవిత్రపాణిః ప్రాణానాయమ్య శుభతిథౌ శోభనముహూర్తే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ అస్మాకం సకుటుంబానాం... ఐశ్వర్యాభివృద్ధ్యర్థం సమస్తమంగళావాప్త్యర్థం అస్య కుమారస్య జాతకర్మ నామకరణాన్నప్రాశనచౌలోపనయనాఖ్యం కర్మ కరిష్యమాణః చౌలోపనయనాంగభూత నాందీశోభనదేవతా ఉద్దిశ్య నాందీశోభనదేవతా ప్రీత్యర్థం నాందీఆహ్వానాఖ్యం కర్మ కరిష్యమాణః । చౌలోపనయనలగ్నకాలే ఆదిత్యాదీనాం నవానాం గ్రహాణాం మధ్యే యే యే గ్రహాః అరిష్టస్థానేషు స్థితాః తేషాం గ్రహాణామనుకూలత్వసిద్ధ్యర్థం యే యే గ్రహాః శుభస్థానేషు స్థితాః తేషాం గ్రహాణామత్యంత శుభఫలావాప్త్యర్థం ఆదిత్యాదినవగ్రహదేవతా ఉద్దిశ్య నవగ్రహదేవతాప్రీత్యర్థం నవగ్రహమఖాఖ్యం కర్మ కరిష్యమాణః॥ అంకురార్పణాఖ్యం కర్మ కరిష్యమాణ్యాః తదాదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం అభ్యుదయార్థంచ మహాజనైస్సహ స్వస్తిపుణ్యాహవాచనం కరిష్యే॥

ఓం పుణ్యాహం దీర్ఘమాయురస్తు। శివా ఆపస్సంతు। సౌమనస్యమస్తు। అక్షతం చారిష్టం చాస్తు। *అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత। అర్చంతు పుత్రకా ఉత పురం న ధృష్ణ్వర్చత । గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం । ఈశ్వరీం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియం। గంధాః పాంతు। సౌమంగల్యమస్తు । ఆయనే తే పరాయణే దూర్వా రోహంతు పుష్పిణీః । హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇమే॥ అక్షతాః పాంతు। ఆయుష్యమస్తు। పుష్పాణి పాంతు। సుమంగల్యం చాస్తు। తాంబూలాని పాంతు । ఐశ్వర్యమస్తు । దక్షిణాః పాంతు। బహుదేయం చాస్తు। స్వశ్రేయసమస్తు । ప్రజాపతిః ప్రియతాం। శాంతిరస్తు । యం కృత్వా సర్వవేదయజ్ఞక్రియాకరణకర్మారంభాః శుభాః శోభనాః ప్రవర్తంతే తమహమోంకారమాదిం కృత్వా భవద్భిరనుజ్ఞాతః పుణ్యం పుణ్యాహం వాచయిష్యే । వాచ్య

తాం। భద్రం కర్ణేభిశ్శృణుయామ దేవాః। భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః। స్థి
రైరంగైస్తుష్టువాగ్ం సస్తనూభిః। వ్యశేమ దేవహితం యదాయుః। ద్రవిణోదా
ద్రవిణసస్తురస్య। ద్రవిణోదాస్సనరస్య ప్రయగ్ంసత్। ద్రవిణోదావీరవతీమి
షంనో ద్రవిణోదా దదాతు దీర్ఘమాయుః। సవితా పశ్చాత్తాత్సవితా పురస్తా
త్సవితోత్తరాత్తాత్సవితాధరాత్తాత్। సవితానస్సువతు సర్వతాతిగ్ం సవితా
నోరాసతాం దీర్ఘమాయుః। నవో నవో భవతి జాయమానోహ్నాం కేతురుష
సామేత్యగ్రే। భాగం దేవేభ్యో విదధాత్యాయన్ప్రచంద్రమాస్తిరతి దీర్ఘమా
యుః। అపహంకం తుజీవసే దీర్ఘాయుత్వాయవర్చసే। యస్త్వాహృదాకీ
రిణా మన్యమానోమర్త్యం మర్త్యో జోహవీమి। జాతవేదో యశో అస్మాసు ధే
హి ప్రజాభిరగ్నే అమృతత్వమశ్యాం। యస్మై త్వగ్ం సుకృతే జాతవేద ఉలో
కమగ్నే కృణవస్స్యోనం। అశ్వినగ్ం సపుత్రిణం వీరవంతం గోమంతగ్ం రయింనశ
తే స్వస్తి। సంతాన్సించామి యజుషా ప్రజామాయుర్ధనంచ। దక్షిణకలశ
మాదాయ। ప్రాక్కలశే కించిత్ప్రసించ్య కంసేనయేత్। దీర్ఘమాయురస్తు।
మనస్సమాధీయతాం॥ సమాహితమనసస్స్మః। ప్రసీదంతు భవంతః। ప్రసం
న్నాస్స్మః। శాంతిరస్తు। పుష్టిరస్తు। తుష్టిరస్తు। వృద్ధిరస్తు। అవిఘ్నమస్తు।
ఆయుష్యమస్తు। ఆరోగ్యమస్తు। స్వస్త్యస్తు। శివంకర్మాస్తు। కర్మసమృద్ధి
రస్తు। పుత్రసమృద్ధిరస్తు। వేదసమృద్ధిరస్తు। శాస్త్రసమృద్ధిరస్తు।
ధనధాన్య సమృద్ధిరస్తు। ఇష్టసంపదస్తు। ఈశాన్యాం బహిర్దేశే
అరిష్టనిరసనమస్తు। కలశానామీశాన్యదేశే ఉదకం సించేత్। యత్పాపంత
త్ప్రతిహతమస్తు। యచ్ఛ్రేయస్తదస్తు। శుక్రాంగారక బుధబృహస్పతిశ
నైశ్చర రాహుకేతుసోమ సహితా ఆదిత్య పురోగాస్సర్వే గ్రహాః ప్రియం
తాం। తిథికరణముహూర్తజన్మనక్షత్రదిగ్దేవతాః ప్రియంతాం। నైరృతి
దిశి। శామ్యంతు ఘోరాణి। శామ్యంతు పాపాని। శామ్యంత్వీతయః। ప్రథ
మకలశే। శుభాని వర్ధంతాం। శివా ఆపస్సంతు। శివా ఋతవస్సంతు। శివా ఓషధయస్సంతు। శివా వ
నస్పతయస్సంతు। అహోరాత్రే శివే స్యాతాం। ఉత్తరే శుభకర్మణ్యవిఘ్నమ
స్తు। ఉత్తరోత్తరం మహాభివృద్ధిరస్తు। ఉత్తరోత్తరాశ్శుభాః క్రియాస్సంపద్యం
తాం। అగ్నిపురోగా విశ్వే దేవాః ప్రియంతాం। మాహేశ్వరీపురోగా
మాతరః ప్రియంతాం। ఇంద్రపురోగా మరుద్గణాః ప్రియంతాం। వసిష్ఠపు

రో గా ఋషిగణాః ప్రియంతాం । శ్రీవిష్ణుపురోగాస్సర్వే దేవాశ్చ ప్రియంతాం । ఆదిత్యపురోగాస్సర్వే గ్రహాః ప్రియంతాం । ఋషయశ్ఛందాగ్స్యాచార్యా వేదా యజ్ఞా దక్షిణాశ్చ ప్రియంతాం । బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ ప్రియంతాం । బ్రహ్మవిష్ణుమహేశ్వరాః తుష్యంతాం । శ్రద్ధామేధే ప్రియేతాం । ప్రియతాం భగవాన్నారాయణః । ప్రియతాం భగవాన్పర్జన్యః । ప్రియతాం భగవాన్స్వామీ మహాసేనః । ప్రియతాం భగవాన్పితామహః । సర్వా ఏతా ఆశిషస్సంతు । పుణ్యాహం ... ప్రియంతాం । ఉద్గాతేవ శకునే సామ గాయసి బ్రహ్మపుత్ర ఇవ సవనేషు శంససి । వృషేవ వాజీ శిశుమతీరపీత్యా సర్వతో నశ్శకునే భద్రమావద । విశ్వతో నశ్శకునే పుణ్యమావద యాజ్యయాయి జతః ప్రతిష్ఠాయై యాజ్యా । పుణ్యే వ లక్ష్మీః పుణ్యామేవ తల్లక్ష్మీం సంభావయతే పుణ్యాం లక్ష్మీం సంస్కురుతే । యత్పుణ్యం నక్షత్రం । తద్బట్కుర్వీతోపవ్యుషం । యదా వై సూర్య ఉదేతి । అథ నక్షత్రం నైతి । యావతి తత్ర సూర్యో గచ్ఛేత్ । యత్ర జఘన్యం పశ్యేత్ । తావతి కుర్వీత యత్కారీ స్యాత్ । తాని వా ఏతాని యమనక్షత్రాణి । యాన్యేవ దేవనక్షత్రాణి । తేషు కుర్వీత యత్కారీ స్యాత్ । పుణ్యాహమేవ కురుతే । ఓం పుణ్యాహం భవంతో బ్రువంతు । ఓం పుణ్యాహం ॥ ఏవం త్రిః । స్వస్తయే వాయు ముపబ్రవామహే సోమం । స్వస్తి భువనస్య యస్పతిః । బృహస్పతిగ్ం సర్వగణం స్వస్తయే స్వస్తయ ఆదిత్యాసో భవంతు నః । ఆదిత్య ఉదయనీయ స్వస్త్యా ప్రియం తే పథ్యాం స్వస్తిమభ్యాయంతి స్వస్త్యై వేదః ప్రియం తే స్వస్త్యై యంతి స్వస్త్యుద్యంతి । స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః । స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు । అష్టౌ దేవా వసవస్సోమ్యాసః । చతస్రో దేవీరజరాః శ్రవిష్ఠాః । తే యజ్ఞం పాంతు రజసః పరస్తాత్ । సంవత్సరీణమమృతగ్గ్ స్వస్తి । మహ్యం సహకుటుంబాయ మహాజనాన్నమస్కుర్వాణా ఆశీర్వచనమపేక్షమాణాయ ... శోభనార్థే ... ఆయుష్మతే స్వస్తి భవంతో బ్రువంతు । ఆయుష్మతే స్వస్తి । ఏవం త్రిః । ఓగ్ స్వస్తి భవంతో బ్రువంతు । ఓగ్ స్వస్తి । ఏవం త్రిః । ఋధ్యాము స్తోమగ్ం సనుయామ వాచమానో మంత్రగ్ం సంధేహూయాపయాతం । యశో నపక్వాం మధుగోష్వంతరాభూలాంశో అశ్వినోః కామమప్రాః । సర్వాప్యృద్ధిమృద్ధ్ను

యామిష్టం తంపైత్రేణ సైవపుత్రస్తాగ్ం స్వాహా భవచ్ఛందోభిర్యత్రోక్షు ఆదుపరిష్టా
ద్గాయత్ర్యా స్వస్త్యశోద్వ్యాశాహం పరిభూయాత్సర్వామృద్ధి మార్ధోనేత్స
ర్వామృద్ధిమృధ్నోతియఏవం వేద। ఋద్ధ్యాస్మహవ్యైర్నమసోపసద్య। మి
త్రం దేవం మిత్రధేయం నో అస్తు అనూరాధాన్ హవిషావర్ధయంతః। శతం
జీవేమశరదస్సవీరాః ఋద్ధ్యై దేవ నామృద్ధాని। త్రీణి ఛందాగ్ంసి త్రీణి
సవనాని। త్రయ ఇమే లోకాః తద్వ్యేవఋషు లోకేషు ప్రతితిష్ఠతి।
వామదక్షిణహస్తాభ్యాం కలశౌ యుగపద్గృహీత్వా। ఋద్ధింభ
వంతో బ్రువంతు। ఋధ్యతామ్। ఋద్ధిః సమృద్ధిః సమముద్ధృత్య। స్వస్తిపుణ్యా
హసమృద్ధిరస్తు। వర్షశతసంపూర్ణమస్తు। గోత్రాభివృద్ధిరస్తు। శాంతిః
పుష్టిస్తుష్టిశ్చాస్తు। శుభగంశుభమస్తు। పురోహితగోబ్రాహ్మణేభ్యశ్శుభంభ
వతు। సర్వసంపదస్తు। భగవాన్వాస్తోష్పతిః ప్రియతామితి భవంతో బ్రువం
తు। భగవాన్వాస్తోష్పతిః ప్రియతాం। శుచీవో హవ్యామరుతశ్శుచీనాగ్ంశు
చిగ్ంహినోమ్యధ్వరగ్ంశుచిభ్యః। ఋతేనసత్యమృతసాప ఆయన్ శుచిజన్మా
నశ్శుచయః పావకాః। అగ్నిస్సుచివ్రతతమశ్శుచిర్విప్రశ్శుచిః కవిః। శుచీరో
చత ఆహుతః। ఉదగ్నే శుచయస్తవ శుక్రాభ్రాజంత ఈరతే। తవజ్యోతీగ్
ష్యర్చయః। యతో న్వింద్రం స్తవామ। శుద్ధం శుద్ధేన సామ్నా। శుద్ధైరుక్థై
ర్వావృధ్వాంసం। శుద్ధ ఆశీర్వాన్మమత్తు। ఇంద్రశ్శుద్ధోన ఆగహి। శుద్ధశ్శు
ద్ధాభిరూతిభిః। శుద్ధోరయిం నిధారయ। శుద్ధో మమద్ధి సోమ్యః। ఇంద్రశ్శు
ద్ధోహినోరయిం। శుద్ధోరత్నాని దాశుషే। శుద్ధో వృత్రాణి జిఘ్నసే। శు
ద్ధో వాజగ్ంసిషాససి। బ్రాహ్మణేష్వమృతగ్ంహితం। యేన దేవాః పవిత్రేణ।
ఆత్మానంపునతేసదా। తేనసహస్రధారేణ। పావమాన్యః పునంతుమా। ప్రా
జాపత్యంపవిత్రం। శతోద్యామగ్ంహిరణ్మయం। తేనబ్రహ్మవిదోవయం।
పూతంబ్రహ్మపునీమహే। ఇంద్రస్సునీతీసహమాపునాతు। సోమస్స్వస్త్యా
వరుణస్సమీచ్యా। యమోరాజాప్రమృణాభిఃపునాతుమా। జాతవేదామూ
ర్జయంత్యాపునాతు। ప్రాచ్యాందిశిదేవా ఋత్విజో మార్జయంతాం। దక్షి
ణాయాందిశిమాసాః పితరో మార్జయంతాం। ప్రతీచ్యాందిశిగృహాః పశ
వో మార్జయంతాం। ఉదీచ్యాందిశ్యాప ఓషధయో వనస్పతయో మార్జయం
తాం। ఊర్ధ్వాయాందిశియజ్ఞస్సంవత్సరో యజ్ఞపతిర్మార్జయంతాం। ఏతే
భ్యో బ్రాహ్మణేభ్యో నానాగోత్రేభ్యో నానానామభ్యః శ్రీలక్ష్మీనారాయణ

ఉమామహేశ్వరాదిత్యాది నవగ్రహస్వరూపేభ్యస్స్వస్తి పుణ్యాహవాచనమంత్రజపదక్షిణాం మనసోత్సాహపరిమిత హిరణ్యం సంప్రదదే నమమ। వాస్తోష్పతే ప్రతిజానీహ్యస్మాన్త్స్వావేశో అనమీవో భవానః। యత్త్వేమహే ప్రతితన్నో జుషస్వ శన్నఏధి ద్విపదే శం చతుష్పదే వాస్తోష్పతే శగ్మయా సగ్ంసదా తే సక్షీమహి రణ్వయా గాతుమత్యా। పాహిక్షేమ ఉతయోగే వరం నో యూయం పాత స్వస్తిభిస్సదా నః। అమీవహా వాస్తోష్పతే విశ్వారూపాణ్యావిశన్। సఖా సుశేవ ఏధినః। శుభగ్ం శుభం। స్వస్త్యయనం తార్క్ష్యమరిష్టనేమిం మహద్భూతం వాయసం దేవతానాం। అసురఘ్నమింద్రసఖం సమత్సు బృహద్యశో నావమివారుహేమ। అగ్ంహోముచమాంగిరసం గయం చ స్వస్త్యాత్రేయం మనసా చ తార్క్ష్యం। ప్రయతపాణిశ్శరణం ప్రపద్యే స్వస్తి సంబాధేష్వభయం నో అస్తు। శుభగ్ం శుభం। హరిః ఓం తత్సత్॥

పుణ్యాహవాచనం సమాప్తం.

* అథ నాందీప్రయోగః. *

పత్న్యా సహ ప్రాణానాయమ్య ఏవంగుణే త్యాది శుభతిథౌ అస్మాకం……వృద్ధ్యర్థం… ధర్మార్థ…సిద్ధ్యర్థం సమస్తమంగళావాప్త్యర్థం అస్య కుమారస్య ఆయుష్యాభివృద్ధ్యర్థం చౌలోపనయనాంగభూతం నాందీ శోభనదేవతా ఉద్దిశ్య నాందీ శోభనదేవతా ప్రీత్యర్థం నాందీ ఆహ్వానాఖ్యం కర్మ కరిష్యే॥ నమస్సదసే నమస్సదసస్పతయే। నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే। నమో దివే। నమః పృథివ్యై॥ అత్ర దేవతాః। నాందీముఖాః। నాందీ। వృద్ధప్రపితామహీ। వృద్ధపితామహీ। వృద్ధమాతరః। గోత్రాః। నాందీముఖాః। నాందీ। వృద్ధప్రపితామహవృద్ధపితామహవృద్ధపితరః। గోత్రాః। నాందీముఖాః నాందీ। మాతామహ మాతుః పితామహమాతుః ప్రపితామహాః। పత్నీసమేతాః। గోత్రాః। నాందీముఖాః। నాందీ। ఉభాభ్యాముభాభ్యాం సత్యవసుసంజ్ఞిక విశ్వేదేవాంశ్చ గృహాసిద్ధాన్నేన హిరణ్యద్రవ్యేణ వాద్యతో పయిష్యే॥ అత్ర దేవతానుమోదనార్థమిడావాచనం కరిష్యే। ఇడా దేవహూర్మనుర్యజ్ఞనీర్బృహస్పతిరుక్థామదాని। శగ్ంసిషద్విశ్వేదేవాస్సూక్తవాచః పృథివిమాతర్మామాహిగ్ంసీర్మధుమనిష్యే మధుజ

నిష్యే మధువక్ష్యామి మధువదిష్యామి మధుమతీం దేవేభ్యో వాచముద్యాసగ్ం శుశ్రూషేణ్యాం మనుష్యేభ్యస్తం మా దేవా అవంతు శోభాయై పితరోఽనుమదంతు॥ ఇడపిహి। పితాశ్శోభన దేవతాః మమకుమారస్య ఉపనయనాది చతుర్థదివసపర్యంతం మమగృహే వసంతు। మాగ్ం రక్షంతు। మమకుమారం రక్షంతు। అదితిర్ద్యౌరదితిరంతరిక్షమదితిర్మాతా స పితా స పుత్రః। విశ్వే దేవా అదితిః పంచజనా అదితిర్జాతమదితిర్జనిత్వం। అదితపహి। పితాశ్శోభన దేవతా మమకుమారస్య ఉపనయనాది చతుర్థదివసపర్యంతం మమగృహే వసంతు। మాగ్ం రక్షంతు। మమకుమారగ్ం రక్షంతు। ప్రణో దేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు। ఆనో దివో బృహతః పర్వతాదా సరస్వతీ। యజతా గంతు యజ్ఞం। సరస్వత్యైహి। మమకుమారస్య ఉపనయనాది చతుర్థదివసపర్యంతం మమగృహే వసంతు। మాగ్ం రక్షంతు। మమకుమారం రక్షంతు॥ శోభనం శోభనం శోభనం॥ నాందీ శోభన దేవతాభ్యో నమః। ధ్యానాది షోడశోపచార పూజాం సమర్పయామి। అనయా పూజయా నాందీ శోభన దేవతాస్సుప్రీతాస్సుప్రసన్నా వరదా భవంతు। (అభ్యుదయిక బ్రాహ్మణభోజనాసనాచ్ఛాదన ప్రత్యామ్నాయ యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదే న మమ)

## * నాందీ విధిః. *

శ్లో॥ మాతా పితామహీ చైవ తథైవ ప్రపితామహీ। పితా పితామహశ్చైవ తథైవ ప్రపితామహః। మాతామహస్సపత్నీకా విశ్వేదేవాస్త్వనంతరం। ఏతే రక్షంతు నః ప్రీతాః ప్రయచ్ఛంతి మహామంగళం। శం... దక్షస్య దుహితా సాధ్వీ విశ్వా నామ ప్రకీర్తితా। తస్యాః పుత్రా మహావీర్యా విశ్వేదేవాస్త్రయోదశ। ఇష్టిశ్రాద్ధే క్రతుర్దక్షః సంకీర్త్యౌ వైశ్వదేవకౌ। నాందీముఖే సత్యవసూ సాపిండ్యే కాలకామకౌ। పురూరవార్ద్రవౌ చైతౌ పార్వణే సముదాహృతౌ। హేమశ్రాద్ధే నురుచీ తద్ధురివిలోచనౌ। ఏకోద్దిష్టే రుద్రసంజ్ఞో విశ్వేదేవాస్త్రయోదశ॥ సూత్రార్థసంగ్రహకారః। వివాహే కన్యకాయాశ్చ వరస్యైవ గృహేపి చ। నాందీశ్రాద్ధం హి పూర్వేద్యుః కర్తవ్యం స్మృతిశాసనాత్। మాతుః శ్రాద్ధం తు పూర్వం స్యాత్పితౄణాం తదనంతరం। తతో మాతామహాదీనాం వృద్ధౌ శ్రాద్ధత్రయం స్మృతం। అత్ర కాలనియమమాహ। గర్గః। మాతుః శ్రాద్ధం తు పూర్వేద్యుః కర్మాహని తు పైతృకం। మాతామహ్యం చోత్తరేద్యుర్వృద్ధౌ శ్రాద్ధత్రయం స్మృతం।

ఏతచ్చ సతి సామర్థ్యే వేదితవ్యం । అసామర్థ్యే త్వేకస్మిన్నేవ దివసే। వృద్ధౌ కాలత్రయే శ్రాద్ధత్రయమభిహితం। కాలచంద్రికాయాం శాతాతపః॥ పూర్వాహ్ణే మాతృకం శ్రాద్ధం మధ్యాహ్నే పైతృకం తథా। తతో మాతామహానాంచ వృద్ధౌ శ్రాద్ధత్రయం స్మృతమితి । తత్రాసామర్థ్యే స ఏవాహ। పృథగ్దినేష్వశక్తశ్చేదేకస్మిన్నేవ వాసరే। శ్రాద్ధత్రయం ప్రకుర్వీత వైశ్వదేవం తు తాంత్రికం। ఇతి। మనురపి । అలాభే భిన్నకాలానాం నాందీశ్రాద్ధత్రయం బుధః। పూర్వేద్యుర్వై ప్రకుర్వీత పూర్వాహ్ణే మాతృపూర్వకమితి । సూత్రార్థసంగ్రహకారః। నాందీముఖే వివాహే చ ప్రపితామహపూర్వకం। అపి జీవపితా నాందీశ్రాద్ధం కుర్యాచ్ఛుభాగమే। పితుశ్చ ప్రపితామహస్యాపి తస్య చ యథావిధి। ఏభ్య ఏవ పితా దద్యాత్తేభ్యో దద్యాత్స్వయం సుతః। జీవమానే పితరి నాందీశ్రాద్ధం ప్రశస్యతే। నాందీముఖే కర్మణి సంప్రవృత్తే పితా గృతో జీవతి యస్య పుంసః। యేభ్యశ్చ దద్యాత్స్వపితా స్వయంచ తేభ్యశ్చ దద్యాదితి శాస్త్రసిద్ధం । నాందీశ్రాద్ధం స్వయం కుర్యాదిత్యనేన ద్వితీయవివాహాదిషు పుత్రః స్వయమేవ నాందీశ్రాద్ధం కుర్యాదిత్యుక్తం భవతి। ఉక్తం చ కాలచంద్రికాయాం॥ శ్లో॥ నాందీశ్రాద్ధం పితా కుర్యాత్పుత్రీ పుత్రవివాహయోః। ఉత్తరేషు వివాహేషు స్వయం కుర్యాత్తు నందన ఇతి । గతాధికారస్యాపి పితుః యాంగాంగాభట్టీయే శాతాతపః। నాందీశ్రాద్ధం పితా కుర్యాదాద్యే పాణిగ్రహే బుధః। అత ఊర్ధ్వం సుతః కుర్యాద్యేభ్య ఏవ పితేతి। సూత్రార్థసంగ్రహకారః। సత్యాం మాతరి జీవంత్యాం శేషవర్గౌ సమర్చయేత్ । మాతామాతామహౌ సంతౌ జీవంతౌ పితరం యజేత్ ॥ ప్రయోగపారిజాతే। జీవమానే మాతృవర్గే మాతామహ్యాదివర్గయేత్ । షట్పిండపితృనా కుర్యాత్తీర్థ శ్రాద్ధే మహాలయే॥ పితాదిజీవనే పిష్టుః॥ పితృజీవతి యః శ్రాద్ధం కుర్యాత్ । యేషాం పితా తేషాం కుర్యాత్ । పితరి పితామహే చ జీవతి । యేషాం పితామహస్తేషాం కుర్యాత్ । పితరి పితామహే ప్రపితామహే చ జీవతి నైవ కుర్యాత్ । ఏకద్విత్రిజీవనే పూర్వవదేవేత్యర్థః। త్రిషు జీవత్సు నైవ కుర్యాదితి పరిశిష్టే। సూత్రార్థసంగ్రహకారః। అసగోత్రస్సగోత్రో వాపి య ఆచార్య ఉపాయనే। స తూపనేయ పిత్రాదీనుద్దిశ్యాభ్యుదయం చరేత్ । కన్యకాయాం మయం మార్గో మునిభిః పరికీర్తితః। ఇత్యుక్తం యాజ్ఞవల్క్యైర్గృహ్య విద్భిర్వృద్ధైః పురాతనైః। తస్మా

ద్ధిపుత్రీకృతపుత్రికాత్మజామాతామహస్యాఖిలరిక్థహారిణః। తథాసురోద్వాహితకన్యకాత్మజా స శ్రాద్ధకర్తృత్వే హవ్యానకారిణ స్త్రయః। వృద్ధౌగయాయాంచమహాలయే కురుక్షేత్రేప్రయాగాద్యఖిలేషుకర్మసు। మాతామహశ్రాద్ధమేకకాలినోభవంత్యమాదిష్వపి నేత్రేసదేత।ఇతినాందీముఖం॥

* నవగ్రహమఖః. *

పశ్చాద్యజమానస్సహప్రాణానాయమ్య ఏవంగుణేత్యాదిశుభతిథౌ ప్రారిప్సితకర్మణః। లగ్నకాలే ఆదిత్యాదీనాం నవానాంగ్రహాణాం మధ్యేయే యేగ్రహాః అరిష్టస్థానేషుస్థితాః తేషాంగ్రహాణా మనుకూలత్వ సిద్ధ్యర్థంయేయేగ్రహాః శుభస్థానేషుస్థితాః తేషాంగ్రహాణాం అత్యంతశుభ ఫలావాప్త్యర్థం అపమృత్యు పరిహారద్వారా ఆయుష్యాభి వృద్ధ్యర్థం ఆదిత్యాది నవగ్రహదేవతా ఉద్దిశ్య నవగ్రహ దేవతాప్రీత్యర్థం నవగ్రహప్రసాదసిద్ధ్యర్థం నవగ్రహమఖాఖ్యం కర్మకరిష్యే॥ తదంగస్థండిలోల్లేఖనాద్యగ్నిప్రతిష్ఠాపనంకరిష్యే। పరిస్తరణాంతంకృత్వా। తదీశాన్యదిగ్భాగే గ్రహారాధనంకుర్యాత్। మధ్యేవర్తులమండలమాదిత్యాయ। ఆగ్నేయ్యాం చతురశ్రగ్ సోమాయ। దక్షిణే త్రికోణమంగారకాయ। ఈశాన్యాంబాణాకారం బుధాయ। ఉత్తరేదీర్ఘచతురశ్రంబృహస్పతయే। ప్రాచ్యాంపంచకోణగ్ శుక్రాయ। పశ్చిమేధనురాకారగ్ శనైశ్చరాయ। నైరృత్యాంశూర్పాకారంరాహవే। వాయవ్యాంధ్వజాకారంకేతవే। అర్కసమిధమాదిత్యాయ। పాలాశగ్ సోమాయ। ఖాదిరమంగారకాయ। అపామార్గంబుధాయ। అశ్వత్థంబృహస్పతయే। ఔదుంబరగ్ శుక్రాయ। శమీగ్ శనైశ్చరాయ। రాహవేదూర్వాః। కేతవేకుశాః॥ ఆకృష్ణేనాగ్నింమూర్ధంకద్రుద్రాయేత్యాదిత్యాయ। ఆప్యాయస్వసమేతుగౌరీమిమాయేతి సోమాయ। అగ్నిర్మూర్ధాస్యోనాపృథివీక్షేత్రస్యపతినాఇయమేత్యంగారకాయ। ఉద్బుధ్యస్వేదంవిష్ణుస్సహస్రశీర్షాపురుషఇతిబుధాయ। బృహస్పతే అతిబ్రహ్మజజ్ఞానమింద్రంవోవిశ్వతస్పరీతి బృహస్పతయే। శుక్రంతే అన్యదింద్రాణీంద్రమరుత్వశ్శుక్రాయ। శమగ్నిఃప్రజాపతేనేతిశనైశ్చరాయ। కయానశ్చిత్రఆయుంగౌర్నమోఅస్తుసర్పేభ్యఇతిరాహవే। కేతుంకృణ్వన్సచిత్రం చిత్రంబ్రహ్మదేవానామితికేతవే॥

సూర్యస్య॥(ఆకృష్ణేనహిరణ్యస్తూపస్సవితాత్రిష్టుప్) ఆకృష్ణేనేత్యస్య మంత్రస్య।హిరణ్యస్తూపఋషిః।సూర్యగ్రహో దేవతా।త్రిష్టుప్ఛందః।సూర్యగ్రహదేవతాముద్దిశ్య... ప్రీత్యర్థంసూర్యగ్రహప్రసాదసిద్ధ్యర్థే అధిదేవతా ప్రత్యధిదేవతాసహితసూర్యగ్రహారాధనేవినియోగః॥ ఆకృష్ణేన। అంగుష్ఠాభ్యాంనమః।రజసావర్తమానః।తర్జనీభ్యాంనమః।నివేశయన్।మధ్యమాభ్యాంనమః।అమృతంమర్త్యంచ।అనామికాభ్యాంనమః।హిరణ్యయేనసవితారథేన కనిష్ఠికాభ్యాంనమః। ఆదేవోయాతిభువనానిపశ్యన్। కరతలకరపృష్ఠాభ్యాంనమః॥ ఏవంహృదయాదిన్యాసః। భూర్భువస్సువరోమితిదిగ్బంధః॥ ధ్యానం॥ వేదీమధ్యేలలితకమలేకర్ణికాయాం రథస్థస్సప్తాశ్వోరోరుణ రుచివపుస్సప్తరజ్జుర్ద్విబాహుః। గోత్రే...బహుః...సప్తాశ్వే ప్రసూతఃకాళింగాఖ్యే విషయజనితఃప్రాఙ్ముఖఃపద్మహస్తః॥ పద్మాసనఃపద్మకరోద్విబాహుః పద్మద్యుతిస్సప్తతురంగవాహః। దివాకరోలోకగురుః కిరీటీమయిప్రసాదంవిదధాతుదేవః॥ (మంత్రః) ఆకృష్ణేనరజసావర్తమానోనివేశయన్నమృతంమర్త్యంచ। హిరణ్యయేనసవితారథేనాదేవో యాతిభువనానిపశ్యన్। ఓంభూర్భువస్సువః। సూర్యగ్రహాగచ్ఛ। సూర్యగ్రహంరక్తవర్ణం రక్తగంధంరక్తపుష్పంరక్తమాల్యాంబరధరంరక్తచ్ఛత్రధ్వజపతాకాదిశోభితం దివ్యరథసమారూఢం మేరుంప్రదక్షిణీకుర్వాణంప్రాఙ్ముఖం పద్మాసనస్థం। ద్విభుజం। సప్తాశ్వం। సప్తరజ్జుం। కళింగదేశాధిపతిం। కాశ్యపసగోత్రం ప్రభవసంవత్సరమాఘశుద్ధసప్తమ్యాం విశాఖనక్షత్రేజాతం సింహరాశ్యధిపతిం। భానువారప్రయుక్తం కిరీటినంసుఖాసీనం పత్నీపుత్రపరివారసమేతం గ్రహమండలేప్రవిష్టమస్మిన్నధికరణే మధ్యేవర్తులాకారమండలేగోధూమధాన్యస్యోపరిసూర్యగ్రహమావాహయామిస్థాపయామి పూజయామి। అగ్నిందూతంవృణీమహే హోతారంవిశ్వవేదసం। అస్యయజ్ఞస్యసుక్రతుం। సూర్యగ్రహాధిదేవతాంఅగ్నింసాంగంసాయుధంసవాహనం సశక్తిపత్నీపుత్రపరివారసమేతం సూర్యగ్రహస్యదక్షిణతః అగ్నిమావాహయామి స్థాపయామి పూజయామి। కద్రుద్రాయప్రచేతసేమీఢుష్టమాయతవ్యసే। వోచేమశంతమగ్ హృదే। సూర్యగ్రహప్రత్యధిదేవతాంరుద్రంసాంగంసాయుధంసవాహనం

సశక్తిపత్నీపుత్రపరివారసమేతం సూర్యగ్రహస్య ఉత్తరతః రుద్రమావాహ
యామిస్థాపయామిపూజయామి ॥౧॥

చంద్రస్య॥ (ఆప్యాయస్వ గౌతమసోమోగాయత్రీ) ఆప్యాయస్వే
త్యస్యమంత్రస్య। గౌతమఋషిః। సోమోదేవతా। గాయత్రీఛందః। యజ
మానస్యాధిదేవతాప్రత్యధిదేవతాసహితచంద్రగ్రహప్రసాదసిద్ధ్యర్థే చంద్ర
గ్రహావాహనే వినియోగః॥ ఆప్యాయస్వ। అంగుష్ఠాభ్యాంనమః। సమేతు
తే। తర్జనీభ్యాంనమః। విశ్వతః। మధ్యమాభ్యాంనమః। సోమవృష్ణియం।
అనామికాభ్యాంనమః। భవావాజస్య। కనిష్ఠికా। సంగథే। కరతల॥ఏవం
హృదయాదిన్యాసః। భూర్భువస్సువరోమితిదిగ్బంధః॥ ధ్యానం॥ ఆగ్నే
యభాగేసరథో దశాశ్వశ్చాత్రేయజో యామునదేశజశ్చ। ప్రత్యఙ్ముఖస్థ
శ్చతురశ్రపీఠే గదాధరాంగో హిమమస్స్వభావః। శ్వేతాంబరశ్శ్వేతవ
పుఃకిరీటీ శ్వేతద్యుతిర్దండధరోద్విబాహుః। చంద్రోమృతాత్మావరదః కిరీ
టీ శ్రేయాంసిమహ్యం విదధాతుదేవః। ఆప్యాయస్వసమేతుతేవిశ్వత
స్సోమవృష్ణియం। భవావాజస్యసంగథే। ఓంభూర్భువస్సువః। చంద్రగ్రహ
మాగచ్ఛ। చంద్రగ్రహాం। శ్వేతవర్ణం శ్వేతగంధం శ్వేతపుష్పం శ్వేతమా
ల్యాంబరధరం శ్వేతచ్ఛత్రధ్వజరథపతాకాదిశోభితం దివ్యరథసమారూఢం
మేరుంప్రదక్షిణీకుర్వాణం దశాశ్వరథవాహనం ప్రత్యఙ్ముఖం ద్విభుజం దండ
ధరం యామునదేశాధిపతిం। ఆత్రేయసగోత్రం నందనసంవత్సరకార్తిక
శుద్ధచతుర్దశ్యాం కృత్తికానక్షత్రేజాతం కర్కటకరాశ్యధిపతిం ఇందువాస
రప్రియుక్తం కిరీటినం సుఖాసీనం పత్నీపుత్రపరివారసమేతం గ్రహమండలే
ప్రవిష్టమస్మిన్నధికరణే సూర్యగ్రహస్యాగ్నేయదిగ్భాగే సమచతురశ్రమం
డలే తండులధాన్యస్యోపరి భగవంతం చంద్రగ్రహం మావాహయామిస్థాప
యామిపూజయామి॥ అప్సుమేసోమోఅబ్రవీదంతర్విశ్వానిభేషజా। అగ్నిం
చవిశ్వశంభువమాపశ్చ విశ్వభేషజీః। చంద్రగ్రహాధిదేవతాం అపఃసాంగం
సాయుధం సవాహనం సశక్తిపత్నీ పుత్రపరివారసమేతం చంద్రగ్రహస్య
దక్షిణతః అపఆవాహయామిస్థాపయామిపూజయామి॥ గౌరీమిమాయసలి
లానితక్షత్యేకపదీద్విపదీసాచతుష్పదీ। అష్టాపదీనవపదీబభూవుషీ। సహ
స్రాక్షరాపరమేవ్యోమన్। చంద్రగ్రహప్రత్యధిదేవతాం గౌరీంసాంగాం

సాయుధాం సవాహనాం సశక్తిపుత్రపరివారసమేతాం చంద్రగ్రహస్యోత్త
రతః గౌరీమావాహయామి స్థాపయామి పూజయామి॥౨॥

అంగారకస్య॥(అగ్నిర్మూర్ధా విరూపోంగారకో గాయత్రీ॥) అగ్ని
ర్మూర్ధేత్యస్యమంత్రస్య। విరూపఋషిః। అంగారకగ్రహో దేవతా।
గాయత్రీఛందః। యజమానస్యాధిదేవతా ప్రత్యధిదేవతాసహితఅంగార
కగ్రహ ప్రసాదసిద్ధ్యర్థే అంగారకగ్రహారాధనే వినియోగః। అగ్నిర్మూర్ధా।
అంగుష్ఠాభ్యాంనమః। దివఃకకుత్। తర్జనీ।పతిఃపృథివ్యాః।మధ్య। అయం।
అనామికా।అపాంరేతాంసి।కనిష్ఠికా।జిన్వతి। కరతల। ఏవంహృదయాది।
న్యాసః। భూర్భువ...దిగ్బంధః। ధ్యానం। యామ్యోగదాశక్తిధరస్త్రిశూలీ
వరప్రదోయామ్యముఖోఽరిరక్తః। కుజస్త్వవంతీవిషయస్త్రికోణస్థస్మేభర
ద్వాజకులేప్రసూతః। రక్తాంబరోరక్తవపుఃకిరీటీ చతుర్భుజో మేషగమోగ
దాభృత్। ధరాసుతశ్శక్తిధరశ్చశూలీ సదామమస్యాద్వరదఃప్రశాంతః।
ఓంఅగ్నిర్మూర్ధా దివఃకకుత్పతిఃపృథివ్యాఅయం। అపాగ్ంరేతాగ్ంసిజిన్వతి।
ఓంభూర్భువస్సువ। అంగారకగ్రహాగచ్ఛ। అంగారకగ్రహంరక్తవర్ణం
రక్తగంధంరక్తపుష్పం రక్తమాల్యాంబరధరం శక్తిశూలధ్వజరథపతాకాది
శోభితం। దివ్యరథసమారూఢం। మేరుంప్రదక్షిణీకుర్వాణం। మేషవాహ
నందక్షిణాభిముఖం। చతుర్భుజం। గదాశూలశక్తిధరం।అవంతిదేశాధిపతిం।
భారద్వాజసగోత్రం క్షయసంవత్సరే ...యాం పూర్వఫల్గునీ నక్షత్ర
జాతం। మేషవృశ్చికరాశ్యధిపతిం। భౌమనామరదప్రియుక్తం। కిరీటినంసు
ఖాసీనం। పత్నీపుత్రపరివారసమేతం। గ్రహమండలేప్రవిష్టమస్మిన్నధికర
ణేసూర్యగ్రహస్యదక్షిణదిగ్భాగే త్రికోణాకారమండలే ఆఢకధాన్యస్యోప
రిభగవంతం అంగారకగ్రహమావాహయామి స్థాపయామి పూజయామి। స్యో
నాపృథివిభవానృక్షరానివేశనీ। యచ్ఛానశ్శర్మసప్రథాః।అంగారకగ్రహా
ధిదేవతాంపృథివీంసాంగాంసాయుధాం సవాహనాంసశక్తిపుత్రపరివార
సమేతాంఅంగారకగ్రహస్యదక్షిణతఃపృథివీమావాహయామిస్థాపయామి
పూజయామి।క్షేత్రస్యపతినావయగ్ంహితేనేవజయామసి।గామశ్వంపోష
యిత్వాసనోమృడాతీదృశే। అంగారకగ్రహప్రత్యధిదేవతాంక్షేత్రపాలకం
సాంగంసాయుధంసవాహనంసశక్తిపత్నీపుత్రపరివారసమేతంఅంగారకగ్ర
హస్యోత్తరతఃక్షేత్రపాలకమావాహయామిస్థాపయామిపూజయామి॥౩॥

బుధస్య॥ (ఉద్బుధ్యస్వాగ్నే మధుశ్ఛందబుధస్త్రిష్టుప్ ॥) ఉద్బుధ్యస్వేత్యస్య మన్త్రస్య । మధుశ్ఛందఋషిః । బుధగ్రహోదేవతా । త్రిష్టుప్ఛందః । యజమానస్యాధిదేవతా ప్రత్యధిదేవతా సహితబుధగ్రహప్రసాదసిద్ధ్యర్థే బుధగ్రహారాధనే వినియోగః ఉద్బుధ్యస్వాగ్నే। అంగుష్ఠాభ్యాంనమః । ప్రతిజాగృహ్యేనం । తర్జనీ । ఇష్టాపూర్తే సగ్ంసృజేథాం। మధ్యమా। అయంచ । అనామికా । పునః కృణ్వగ్గ్ స్త్వా పితరంయువానం। కనిష్ఠికా । అన్వాతాగ్ంసీత్వయి తంతుమేతం । కరతలకరపృష్ఠాభ్యాం। ఏవంహృదయాదిన్యాసః । భూర్భువస్సువరోమితిదిగ్బంధః॥ ధ్యానం ॥ ఉదఙ్ముఖో మాగధజో హరిత్స్థశ్చాత్రేయగోత్ర శ్శరమణ్డలస్థః। సఖడ్గచర్మోరుగదాధరోఽబ్జ స్సింహాసనస్థో వరదస్సుపీతః । పీతాంబరః పీతవపుః కిరీటీ చతుర్భుజో దండధరశ్చ సౌమ్యః । చర్మాసిధృక్సోమసుతస్సుమేరు స్సింహాధిరూఢో వరదో బుధశ్చ । ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహ్యేన మిష్టాపూర్తే సగ్ంసృజేథామయంచ । పునః కృణ్వగ్గ్ స్త్వా పితరంయువానమన్వాతాగ్ంసీత్వయి తంతుమేతం। ఓం భూర్భువస్సువః। బుధగ్రహ ఆగచ్ఛ। బుధగ్రహం పీతవర్ణం పీతగంధం పీతపుష్పం పీతమాల్యాంబరధరం పీతచ్ఛత్రధ్వజరథపతాకాదిశోభితం దివ్యరథసమారూఢం మేరుం ప్రదక్షిణీకుర్వాణం । సింహవాహనం। ఉదఙ్ముఖం । మగధదేశాధిపతిం । చతుర్భుజం । ఖడ్గచర్మాంబరధరం । ఆత్రేయసగోత్రం । సౌమ్యసంవత్సర ఏకాదశ్యాముత్తరాఫల్గునీనక్షత్రజాతం । కన్యామిథునరాశ్యధిపతిం । సౌమ్యవారప్రయుక్తం । కిరీటినం సుఖాసీనం । పత్నీపుత్రపరివారసమేతం గ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణే సూర్యగ్రహస్యేశాన్యదిగ్భాగే బాణాకారమండలే ముద్గధాన్యస్యోపరిభవంతం బుధగ్రహమావాహయామి స్థాపయామి పూజయామి। ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదం । సమూఢమస్య పాగ్ంసురే। బుధగ్రహాధిదేవతాం విష్ణుం సాంగం సాయుధం సవాహనం సశక్తిపత్నీపుత్రపరివారసమేతం బుధగ్రహస్య దక్షిణతః విష్ణుమావాహయామి స్థాపయామి పూజయామి। సహస్రశీర్షా... ద్దశాంగులం। బుధగ్రహప్రత్యధిదేవతాం నారాయణం సాంగం సాయుధం సవాహనం సశక్తిపత్నీపుత్రపరివారసమేతం బుధగ్రహస్యోత్తరతః నారాయణ మావాహయామి స్థాపయామి పూజయామి॥ ౪॥

బృహస్పతేః॥ (బృహస్పతే గృత్సమదో బృహస్పతిర్జగతీ.) బృహస్పతే అతియదర్య ఇత్యస్య మన్త్రస్య । గృత్సమద ఋషిః । బృహస్పతిగ్రహో దేవతా । జగతీ ఛన్దః । యజమానస్యాధిదేవతాప్రత్యధిదేవతాసహిత బృహస్పతిగ్రహ ప్రసాదసిద్ధ్యర్థే బృహస్పతిగ్రహారాధనే వినియోగః॥ బృహస్పతే అతియదర్యో అర్హాత్ । అఙ్గుష్ఠాభ్యాం నమః । ద్యుమద్విభాతి । తర్జనీ । క్రతుమజ్జనేషు । మధ్యమా । యద్దీదయచ్ఛవస । అనామికా । ఋతప్రజాత తదస్మాసు । కనిష్ఠికా । ద్రవిణం ధేహి చిత్రం । కరతల । ఏవం హృదయాదిన్యాసః । భూర్భువ... దిగ్బన్ధః । ధ్యానం॥ సౌమ్యే మధ్యే చతురశ్రపీఠే రథేఽత్ర రాః స్వాముఖస్స్వభావః । దండాక్షమాలాజలపాత్రధారీ సింధ్వాఖ్యదేశే వరదస్సుకేశః । కనకాంబరః కనకవపుః కిరీటీ చతుర్భుజో దేవగురుః ప్రశాంతః । తథాపి దండం చ కమండలుం చ తథాక్షసూత్రా ద్వరదోస్తు నాస్మై॥

బృహస్పతే అతియదర్యో అర్హాద్ద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు । యద్దీదయచ్ఛవస ఋతప్రజాత తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రం । ఓం భూర్భువస్సువః । బృహస్పతిగ్రహ ఇహాగచ్ఛ । బృహస్పతిగ్రహం కనకవర్ణం । కనకగన్ధం । కనకపుష్పం కనకమాల్యాంబరధరం । కనకచ్ఛత్రధ్వజపతాకాదిశోభితం । దివ్యరథసమారూఢం । మేరుం ప్రదక్షిణీకుర్వాణం । పూర్వాభిముఖం । పద్మాసనస్థం । చతుర్భుజం । దండాక్షమాలాధారిణం । సింధూద్భవ దేశాధిపతిం । ఆంగీరసగోత్రం సౌమ్యసంవత్సరే వైశాఖశుక్లైకాదశ్యాం ఉత్తరానక్షత్రజాతం । ధనుర్మీనరాశ్యధిపతిం గురువాసరాభిముఖం । కిరీటినం సుఖాసీనం పత్నీపుత్రపరివారసమేతం । గ్రహమండలే ప్రతిష్ఠాపయిష్యమాణాధికరణే సూర్యగ్రహస్యోత్తరదిగ్భాగే దీర్ఘ చతురశ్రమండలే చణకధాన్యస్యోపరి బృహస్పతిగ్రహమావాహయామి స్థాపయామి పూజయామి । బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తాద్విసీమతస్సురుచో వేన ఆవః । సబుధ్నియా ఉపమా అస్య విష్ఠాస్సతశ్చ యోనిమసతశ్చ వివః । బృహస్పతిగ్రహాధిదేవతాం బ్రహ్మాణం సాంగం సాయుధం సవాహనం సశక్తిపత్నీపుత్రపరివారసమేతం బృహస్పతిగ్రహస్య దక్షిణతః బ్రహ్మాణమావాహయామి స్థాపయామి పూజయామి । ఇంద్రం వో విశ్వతస్పరిహవామహే జనేభ్యః । అస్మాకమస్తు కేవలః । బృహస్పతిగ్రహప్రత్యధిదేవతామింద్రం సాంగం సాయుధం సవాహనం సశక్తిపత్నీపుత్రపరివారసమేతం బృహస్పతిగ్రహస్యోత్తరతః ఇంద్రమావాహయామి స్థాపయామి పూజయామి॥ ౫

శుక్రస్య। (శుక్రంతే భరద్వాజ శ్శుక్ర(స్త్రి)ష్టుప్.) శుక్రంతేఅన్య
దిత్యస్యమన్త్రస్య భరద్వాజఋషిః। శుక్రగ్రహో దేవతా। త్రిష్టుప్ఛందః।
యజమానస్యాధిదేవతా ప్రత్యధిదేవతాసహిత శుక్రగ్రహప్రసాదసిద్ధ్యర్థే
శుక్రగ్రహారాధనే వినియోగః॥ శుక్రంతేఅన్యత్। అంగు। యజతంతేఅన్యత్
తర్జనీ। విషురూపేఅహని। మధ్యమా। ద్యౌరివాసి। అనామికా। విశ్వా
హిమాయాఅవసిస్వధావః। కనిష్ఠికా। భద్రాతేపూషన్నిహరాతిరస్తు।
కరతల। ఏవంహృదయాదిన్యాసః భూర్భువ...దిగ్బంధః। ధ్యానం॥ ప్రా
చ్యాంభృగుర్భోజకటప్రదేశ స్సభార్గవః పూర్వముఖ స్వభావః। సపంచ
కోణేశరథాదిరూఢో దండాక్షమాలా వరదాంబుపాత్రః। శ్వేతాంబర
శ్శ్వేతవపుఃకిరీటీచతుర్భుజో దైత్య గురుఃప్రశాన్తః। తథాసిదండంచకమం
డలుంచ తథాక్షసూత్రాద్వరదోస్తుతస్మై। శుక్రంతే అన్యద్యజతంతే అన్య
ద్విషురూపే అహనీద్యౌరివాసి। విశ్వాహిమాయాఅవసిస్వధావోభద్రా
తేపూషన్నిహరాతిరస్తు। ఓంభూర్భువస్సువః। శుక్రగ్రహఆగచ్ఛ। శు
క్రగ్రహంశ్వేతవర్ణం। శ్వేతగంధం। శ్వేతపుష్పం। శ్వేతమాల్యాంబరధరం
శ్వేతచ్ఛత్రధ్వజరథపతాకాదిశోభితం। దివ్యరథసమారూఢం। మేరుంప్ర
దక్షిణీకుర్వాణం। పూర్వాభిముఖం। పద్మాసనస్థం। చతుర్భుజం। దండా
క్షమాలా జటావల్కల ధారిణం। కాంభోజదేశాధిపతిం। భార్గవసగో
త్రం। మన్మథసంవత్సరదశమ్యాంపుష్యనక్షత్రజాతం। తులావృషభరా
శ్యధిపతిం। భృగువారప్రయుక్తంకిరీటినంసుఖాసీనం పత్నీపుత్రపరివారస
మేతంగ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణేసూర్యగ్రహస్య ప్రాగ్భాగేపం
చకోణాకారమండలే రాజమాషధాన్యస్యోపరి శుక్రగ్రహమావాహయా
మిస్థాపయామిపూజయామి॥ ఇంద్రాణీమాసునారిషుసుపత్నీ మహమశ్ర
వం।నహ్యస్యాఅపరంచనజరసామరతేపతిః॥శుక్రగ్రహాధిదేవతాంఇంద్రా
ణీంసాంగాంసాయుధాంసవాహనాంసశక్తిపుత్రపరివారసమేతాంశుక్ర
గ్రహస్య దక్షిణతఃఇంద్రాణీమావాహయామిస్థాపయామిపూజయామి
ఇంద్రమరుత్వఇహపాహిసోమంయథాశార్యాతేఅపిబస్సుతస్య తవప్రణీ
తీతవశూరశర్మన్నావివాసంతికవయస్సుయజ్ఞాః। శుక్ర గ్రహప్రత్యధిదే
తాం ఇంద్రమరుత్వంతంసాంగం సాయుధంసవాహనంసశక్తిపత్నీపుత్రప
వారసమేతం శుక్రగ్రహస్యోత్తరతః ఇంద్రమరుత్వంత మావాహయామి

స్థాపయామి పూజయామి॥..................................౬

శనైశ్చరస్య॥ (శమగ్నిరిళింమిళిశ్శనిరుష్ణిక్.) శమగ్నిరగ్నిభిరిత్యస్యమంత్రస్య। ఇళింమిళిఋషిః। శనైశ్చరగ్రహోదేవతా। ఉష్ణిక్ఛందః। యజమానస్యాధిదేవతా ప్రత్యధిదేవతాసహిత శనైశ్చరగ్రహప్రసాదసిద్ధ్యర్థే శనైశ్చరగ్రహారాధనేవినియోగః॥ శమగ్నిః। అంగు। అగ్నిభిస్కరత్। తర్జనీ। శంనస్తపతుసూర్యః। మధ్యమా। శంవాతః। అనామికా। వాత్వరపాః। కనిష్ఠికా। అపస్రిధః। కరతల। ఏవం... న్యాసః। భూర్భువ... దిగ్బంధః॥

ధ్యానం॥ చపాసనోగృధ్రరథస్సునీలః ప్రత్యఙ్ముఖఃకాశ్యపతిః ప్రతీచ్యాం। సశూలచాపేషువరప్రదశ్చ సౌరాష్ట్రదేశేప్రభవశ్చసౌరిః। నీలద్యుతిర్నీలవపుఃకిరీటీగృధ్రస్థితశ్చాపకరోధనుష్మాన్। చతుర్భుజస్సూర్యసుతఃప్రశాంతః స్సచాస్తుమహ్యంవరమందగామీ॥ శమగ్నిరగ్నిభిస్కరచ్ఛన్నస్తపతుసూర్యః। శంవాతోవాత్వరపాఅపస్రిధః। ఓంభూర్భువస్సువః। శనైశ్చరగ్రహ ఇహాగచ్ఛ। శనైశ్చరగ్రహంనీలవర్ణం। నీలపుష్పం। నీలమాల్యాంబరధరం। నీలచ్ఛత్రధ్వజరథపతాకాదిశోభితం। దివ్యరథసమారూఢం। మేరుంప్రదక్షిణీకుర్వాణం। చాపాసనస్థం। ప్రత్యఙ్ముఖం। గృధ్రరథం। చతుర్భుజం। శూలాయుధధరం। సౌరాష్ట్రదేశాధిపతిం। విరోధిసంవత్సరనవమ్యాం రోహిణీనక్షత్రజాతం। మకరకుంభరాశ్యధిపతిం। మందవారప్రియుక్తం। కిరీటినం సుఖాసీనం పత్నీపుత్రపరివారసమేతం। గ్రహమండలేప్రవిష్టమస్మిన్నధికరణేసూర్యగ్రహస్య పశ్చిమదిగ్భాగే ధనురాకారమండలేతిలధాన్యస్యోపరిభగవంతంశనైశ్చరగ్రహమావాహయామి। స్థాపయామి। పూజయామి। యమాయసోమగ్ంసునుతయమాయజుహుతాహవిః। యమగ్ంహయజ్ఞోగచ్ఛత్యగ్నిదూతోఅరంకృతః। శనైశ్చరగ్రహాధిదేవతాంయమంసాంగంసాయుధం సవాహనంసశక్తిపత్నీపుత్రపరివారసమేతం శనైశ్చరగ్రహస్యదక్షిణతః। యమమావాహయామి స్థాపయామిపూజయామి। ప్రజాపతేనత్వదేతాన్యన్యోవిశ్వాజాతానిపరితాబభూవ। యత్కామాస్తేజుహుమస్తన్నోఅస్తువయగ్ంస్యామపతయోరయీణాం। శనైశ్చరగ్రహప్రత్యధిదేవతాంప్రజాపతింసాంగం। సాయుధం। సవాహనంసశక్తిపత్నీపుత్రపరివారసమేతంశనైశ్చరగ్రహస్యోత్తరతః ప్రజాపతిమావాహయామి స్థాపయామి పూజయామి॥ ౭

రాహోః ॥ (కయానో వామదేవో రాహుర్గాయత్రీ.) కయానశ్చిత్రే త్యస్య మన్త్రస్య । వామదేవఋషిః । రాహుగ్రహో దేవతా । గాయత్రీ ఛన్దః । యజమానస్యాధి ... సహిత రాహుగ్రహప్రసాదసిద్ధ్యర్థే రాహుగ్రహారాధనే వినియోగః ॥ కయానః । అంగుష్ఠా । చిత్రఆభువత్ । తర్జనీ । ఊతీ । మధ్య । సదావృధ । అనామి । సఖా । కనిష్ఠికా । కయాశచిష్ఠయా వృతా । కరతల । ఏవం హృదయాది న్యాసః । భూర్భువ.. దిగ్బంధః ॥ ధ్యానం ॥ పైఠీనసో బర్బరదేశజాతశ్శూర్పాసనస్సింహగతస్సదా హ్యః । యామ్యాననో నైఋతికగాఙ్గో వరప్రదశ్శూలసచర్మఖడ్గః ॥ నీలాంబరో నీలవపుః కిరీటీ కరాళవక్త్రః కరవాలశూలీ । చతుర్భుజశ్చర్మధరశ్చ రాహుస్సింహాధిరూఢో వరదోస్తు శాంత్యై ॥ కయానశ్చిత్రఆభువదూతీసదావృధస్సఖా । కయాశచిష్ఠయావృతా । ఓం భూర్భువస్సువః । రాహుగ్రహ ఇహాగచ్ఛ । రాహుగ్రహం నీలవర్ణం నీలగంధం । నీలపుష్పం । నీలమాల్యాంబరధరం । నీలఛత్రధ్వజరథపతాకాదిశోభితం । దివ్యరథసమారూఢం । మేరుం ప్రదక్షిణీకుర్వాణం । సింహాసనం నైఋతిముఖం శూర్పాసనస్థం చతుర్భుజం కరాళవక్త్రం ఖడ్గచర్మవరకరం పైఠీనసగోత్రం బర్బరదేశాధిపతిం । కిరీటినం సుఖాసీనం పత్నీపుత్రపరివారసమేతం । గ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణే సూర్యగ్రహస్య నైఋతిదిగ్భాగే శూర్పాకారమండలే మాషధాన్యస్యోపరి భగవంతం రాహుగ్రహమావాహయామి స్థాపయామి పూజయామి ॥ ఆయం గౌః పృశ్నిరక్రమీదసదన్మాతరం పునః । పితరం చ ప్రయన్త్సువః । రాహుగ్రహాధిదేవతాం గాం సాంగాం సాయుధాం సవాహనాం సశక్తిపుత్రపరివారసమేతాం రాహుగ్రహస్య దక్షిణతః గామావాహయామి స్థాపయామి పూజయామి ॥ నమోఽస్తు సర్పేభ్యో యే కే చ పృథివీమను । యే అంతరిక్షే యే దివి తేభ్యస్సర్పేభ్యో నమః । రాహుగ్రహ ప్రత్యధిదేవతాం సర్పం సాంగం సాయుధం సవాహనం సశక్తిపత్నీ పుత్రపరివారం సమేతం రాహుగ్రహస్యోత్తరతః సర్పమావాహయామి స్థాపయామి పూజయామి ॥......౮

కేతోః ॥ (కేతుం కృణ్వన్మధుచ్ఛందాః కేతుర్గాయత్రీ.) కేతుం కృణ్వన్నిత్యస్య మన్త్రస్య । మధుచ్ఛంద ఋషిః । కేతుగణో దేవతా । గాయత్రీ ఛన్దః । యజమానస్యాధిదేవతా ప్రత్యధిదేవతా సహిత కేతుగణప్రసాదసిద్ధ్యర్థే కేతుగణారాధనే వినియోగః ॥ కేతుంకృణ్వన్ । అంగుష్ఠా । అకే

తవే। తన్వస। పేశో మర్యా। మధ్య। అపేశసే। అనామికా। సముషద్భిః। కనిష్ఠికా।అజాయథాః।కరతల।ఏవం హృదయాది న్యాసః। భూర్భు...దిగ్బంధః॥ ధ్యానం॥ధ్వజాసనో జైమినిగోత్రజోంతర్వేదీషు దేశేషు విచిత్రవర్ణః। యామ్యాననో వాయుది శి పక్షిధ్వజశ్చాసిభిశ్చాప్త ఇతశ్చ కేతుః ॥ ధూమ్రో ద్విబాహు ర్వరదో గదాభృద్గృధ్రాసనస్థో వికృతాననశ్చ। కిరీటకేయూరవిభూషితాంగస్సచాస్తు మే కేతుగణః ప్రశాంతః॥ ఓం కేతుంకృణ్వన్న కేతవే పేశో మర్యా అపేశసే। సముషద్భిరజాయథాః। ఓం భూర్భువస్సువః। కేతుగణేహాగచ్ఛ। కేతుగణం చిత్ర వర్ణం। చిత్ర గంధం। చిత్రపుష్పం। చిత్ర మాల్యాంబరధరం। చిత్రచ్ఛత్రధ్వజపతాకాది శోభితం। దివ్యరథసమారూఢం। మేరుం ప్రదక్షిణీకుర్వాణం। ధ్వజాసనస్థం। దక్షిణాభిముఖం। చతుర్భుజం। అన్తర్వేది దేశాధిపతిం। ద్విబాహుం। గదాధరం। జైమినిసగోత్రం। అభిజిన్నక్షత్రజాతం। సింహాసనాసీనం। గ్రహమండలే ప్రవిష్టమస్మిన్నధికరణే సూర్యగ్రహస్య వాయవ్యదిగ్భాగే ధ్వజాకారమండలే। కుశస్థధాన్యస్యోపరి కేతుగణమావాహయామి స్థాపయామి పూజయామి ॥ సచిత్ర చిత్రం చితయంత మస్మే చిత్రక్షత్రం చిత్ర తమం వయోధాం। చంద్రం రయిం పురువీరం బృహంతం చంద్రచంద్రాభి ర్గృణతే యువస్వ। కేతుగణాధిదేవతాం చిత్రగుప్తం సాంగం సాయుధం సవాహనం సశక్తిపత్నీ పుత్రపరివారసమేతం। కేతుగణస్య దక్షిణతః చిత్రగుప్త మావాహయామి స్థాపయామి పూజయామి॥ బ్రహ్మా దేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణాం। శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్। కేతుగణ ప్రత్యధిదేవతాం బ్రహ్మాణం సాంగం సాయుధం సవాహనం సశక్తిపత్నీ పుత్రపరివార సమేతం కేతుగణస్యోత్తరతః బ్రహ్మాణమావాహయామి స్థాపయామి పూజయామి॥ ...... ...... ...౯

జాతవేదసే సునవామ సోమ మరాతీయతో నిదహాతి వేదః। స నః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితాత్యగ్నిః। దుర్గామావాహయామి స్థాపయామి పూజయామి॥ గణానాం ..నం। గణపతిమా...మి। క్షేత్రస్య పతినా వయగ్ం హితేనేవ జయామసి। గామశ్వం పోషయిత్న్వా స నో మృ

గాంటీదృశే। క్షేత్రపాలకమావా...మి * స్వస్తిదావిశస్పతిర్వృత్రహావిమృధోవశీ। వృషేంద్రః పుర ఏతునస్స్వస్తిదా అభయంకరః। అభయంకరమా...మి। ఇంద్రంవో విశ్వతస్పరిహవామహే జనేభ్యః। అస్మాకమస్తు కేవలః। ఇంద్రంలోకపాలమావా...మి। అగ్నిందూతంవృణీమహే హోతారంవిశ్వవేదసం। అస్యయజ్ఞస్యసుక్రతుం। అగ్నింలోకపాల...మి। యమాయసోమగ్ంసునుతయమాయజుహుతాహవిః। యమగ్ంహయజ్ఞోగచ్ఛత్యగ్నిదూతో అరంకృతః। యమంలోక...మి। మహాపునః పరాపరాని ర్ ర్ తిర్ద్రుహాణావధీత్। సోస్తృత్స్నయాసహ। నిర్ ఋతింలోక ..మి।ఇమంమేవరు...చకే। వరుణంలోకపా...మి।తవవాయువృతస్పతేత్వష్టుర్జామాతురద్భుత।ఆవాంస్యావృణీమహే। వాయువ్యంలోక...మి। సోమోధేనుగ్ంసోమో అర్వంతమాశుగ్ం సోమోవీరంకర్మణ్యందదాతు। సాదన్యంవిదథ్యగ్ంసభేయంపితుశ్రవణం యోమదదాశదస్మై। కుబేరంలోక...మి। తమీశానంజగతస్తస్థుషస్పతింధియంజిన్వమవసేహూమహేవయం। పూషానోయథావేదసామసద్వృధేరక్షితాపాయురదబ్ధస్స్వస్తయే। ఈశానంలోకపా...మి। ఊర్ధ్వఊషుణఊతయే తిష్ఠాదేవోనసవితా। ఊర్ధ్వోవాజస్యసనితాయదంజిభిర్వాఘద్భిర్విహ్వయామహే। ఊర్ధ్వపురుషమా...మి। స్యోనాపృథి...థాః। పృథివీమా...మి। వాస్తోష్పతేప్రతిజానీహ్యా...శంచతుష్పదే। వాస్తుపురుషమా...మి। బ్రహ్మదేవానాం...రేభన్। బ్రహ్మాణమా...మి। ప్రణోదేవీసరస్వతీవాజేభిర్వాజినీవతి। ధీనామవిత్ర్యవతు। సరస్వతీమా...మి। ఇదంవిష్ణు...సురే। విష్ణుమా...మి। సక్తుమివతితఉనాపునంతోయత్రధీరామనసావాచమక్రత। అత్రాసఖాయస్సఖ్యానిజానతే భద్రైషాంలక్ష్మీర్నిహితాధివాచి। లక్ష్మీమా...మి। కద్రుద్రాయప్రచేతసే...హృదే।రుద్రమా...మి। గౌరీమిమాయసలిలా...వ్యోమన్।గౌరీమా...మి। క్రాణాశిశుర్మహీనాంహిన్వన్నృతస్యదీధితిం।విశ్వాపరిప్రియాభువదద్వితా।ఆదిత్యప్రత్నస్యరేతసోజ్యోతిః పశ్యంతివాసరం పరోయదిధ్యతేదివా। అశ్వనీ దేవతమా...మి। ఏషోఉషాఅపూర్వ్యావ్యుచ్ఛతిప్రియాదివః। స్తుషేవామశ్వి

---

* యత ఇంద్రభయామహే తతోనో అభయంకృధి। మఘవంఛగ్ధి తవతన్న ఊతయే విద్విషో విమృధోజహి। అభయంకరమావాహయామి ...పూజయామి॥ క్షత్రోస్తోరియఃసాంతః.

నాబృహత్ ॥ అశ్వనీదేవతాంనమా...మి॥ సుపర్ణోసిగరుత్మాన్త్రివృత్తేశిరో గాయత్రంచక్షుస్స్తోమ ఆత్మాసామతేతనూర్వామదేవ్యం బృహద్రథంతరే పక్షౌయజ్ఞాయజ్ఞియంపుచ్ఛం ఛందాగ్‌స్యంగానిధిష్ణియాశ్శఫాయజూగ్ంషినామ। సుపర్ణోసిగరుత్మాన్దివంగచ్ఛసువఃపత। గరుడమావా...మి। ధన్వనాగాధన్వనాజింజయేమ ధన్వనాతీవ్రాస్సమదోజయేమ। ధనుశ్శత్రోరపకామంకృణోతుధన్వనాసర్వాఃప్రదిశోజయేమ। ధన్వంతరిమా...మి। ముంచామిత్వాహవిషా జీవనాయక మజ్ఞాతయక్ష్మా దుతరాజయక్ష్మాత్। గ్రాహిర్జగ్రాహ యద్యేతదేనం తస్యాఇంద్రాగ్నీప్రముముక్తమేనం। ఇంద్రాగ్నీఆ...మి। యదిక్షితాయుర్యదివాపరేతో యదిమృత్యోరంతికంనీతమే వతమాహరామినిర్ఋతేరుపస్థా దస్పార్షమేనంశతశారదాయ। నిర్ఋతిమా...మి। సంసృష్టం ధనముభయం। సమాకృతమస్మభ్యందత్తాంవరుణశ్చమన్యుః। భియందధానాహృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయంతాం। శత్రుఫలమా...మి। దూరమస్మచ్ఛత్రవోయంతుభీతాః। తదింద్రాగ్నీకృణుతాంతద్విశాఖే। తన్నోదేవాఅనుమదంతుయజ్ఞం పశ్చాత్పురస్తాదభయన్నో అస్తు। నక్షత్రాణామధిపత్నీవిశాఖే। శ్రేష్ఠావింద్రాగ్నీ భువనస్యగోపౌ। విషూచశ్శత్రూనపబాధమానౌ। అపక్షుధన్నుదతామరాతిం॥ విశాఖానక్షత్రమా...మి॥ మంటపస్థఆదిత్యాదినవగ్రహదేవతాభ్యోనమః॥ ఇంద్రాద్యష్టదిక్పాలక దేవతాభ్యోనమః॥ దుర్గాగణపతిక్షేత్రపాలక అభయంకరవాస్తుపురుషాది దేవతాభ్యోనమః॥ ధ్యానాదిషోడశోపచారపూజాంసమర్పయామి॥ నమ స్సూర్యాయ సోమాయ మంగళాయబుధాయచ। గురుశుక్రశనిభ్యశ్చ రాహవే కేతవేనమః॥ ప్రార్థనాంసమర్పయామి॥ అనయాపూజయామంటపస్థదేవతాస్సుప్రీతాస్సుప్రసన్నావరదాభవంతు

ఇతినవగ్రహారాధనవిధిః.

## అథ మృత్యుంజయం.

అస్యశ్రీత్ర్యంబకస్తోత్రమహామన్త్రస్య। మైత్రావరుణపుత్రోవసిష్ఠ ఋషిః। అనుష్టుప్ఛందః। శ్రీమృత్యుంజయత్ర్యంబకరుద్రోదేవతా। దేవదేవ్యౌప్రణవోబీజశక్తిః। అత్రమూలమంత్రేణకరశుద్ధింకృత్వా। ప్రణవంకరతలయోర్విన్యస్య। వ్యాహృత్యాదిమన్త్రపాదచతుష్టయంకరయోరంగుష్ఠాదికనిష్ఠికాంత మంగుళీషువిన్యస్యతతస్సర్వేణవ్యాపకన్యాసంకృత్వాదే

హాంగన్యాసమాచరేత్ । ఓంభూః...వః అంగుష్ఠాభ్యాంనమః త్రియంబకం
యజామహే । తర్జ । సుగంధింపుష్టివర్ధనం । మధ్య । ఉర్వారుకమివబంధ
నాత్ । అనా । మృత్యోర్ముక్షీయమామృతాత్ । కని । ఓంభూః...వఃత్రియం
బకం...తాత్ । కరతల । త్రియంబకమితి శిరసి । యజామహ ఇతి లలాటే । సుగం
ధిమితిముఖే । పుష్టివర్ధనమితి హృదయే । ఉర్వారుకమితికుక్షౌ । ఇవేతినాభౌ
బంధనాదితికట్యాం । మృత్యోరితిఊర్వోః । ముక్షీయేతిజాన్వోః । మా
ఇతి జంఘయోః । అమృతాదితిపాదయోః । ఏవందేహాంగన్యాసంకృత్వాష
డంగన్యాసమాచరేత్ । ఓంనమోభగవతేత్రియంబకాయ శూలపాణయే
స్వాహా । హృదయే । ఓంనమో... తేరుద్రాయామితమూర్తయే మాంజీవయశిర
సేస్వాహా । శిరసి । ఓంన... తేనీలకంఠాయచంద్రజటినేస్వాహా । శిఖా । ఓం
న... తేత్రిపురాంతకాయ హ్రాంహ్రీం । కవ । ఓంన... తేత్రిలోచనాయఋ
గ్యజుస్సామాథర్వణమూర్తయే । నేత్ర । ఓంనమోభగవతేరుద్రాయాగ్ని
త్రయాయజ్వలజ్వలమాం రక్షరక్షఅఘోరాస్త్రాయఫట్ । భూర్భు
వస్సువరోమితిదిగ్బంధః । ధ్యానం । తతశ్చంద్రమండలోపరిబద్ధపద్మాస
నం చంద్రవర్ణం స్రవదమృతపూర్ణచంద్రకళాధరం । యోగముద్రాక్షమా
లాబద్ధాధరహస్తద్వయంధృతామృతపూర్ణకనకకలశోత్తరకరద్వయం । సో
మసూర్యాగ్నిత్రిలోచనంబద్ధపింగజటాజూటంనాగయజ్ఞోపవీతినం నాగా
భరణభూషితం వ్యాఘ్రచర్మాంబరధరం భక్తానుకంపనంభస్మానులేపనంశ్రీ
రుద్రంధ్యాత్వా స్నేహపూర్ణేన మనసాపూర్వోక్తమార్గేణార్చయిత్వాశ
రణంవ్రజేత్ ॥ త్ర్యంబకమహాదేవత్రాహిమాం శరణాగతం ॥ జన్మమృత్యు
జరారోగైః పీడితంకర్మబంధనైః । తావకస్త్వద్గతప్రాణస్త్వచ్చిత్తోహం
సదామృడ । ఇతివిజ్ఞాప్యదేవేశం జపేన్మంత్రంత్రియంబకం ॥ ఇతిప్రార్థనాం
కృత్వాజపేత్ ॥ ఓంభూర్భువస్సువః ॥ త్రియంబకంయజామహే సు...మా
మృతాత్ ॥ అపమృత్యుమపకుధమపేతశ్మపథంజహి ॥ అథానో అగ్న ఆవహ
రాయస్పోషగ్ సహస్రిణం ॥ ఏతేసహస్ర...మృత్యవేస్వాహా ॥ మమసర్వా
పమృత్యుర్నశ్యతు ఆయుర్వర్ధతాం ॥ (యథాశక్తిజపంకుర్యాత్.) అచ్యుతః
కల్పవృక్షశ్చ అనంతః కామధేనవః చింతామణిస్తుగోవిందో నామత్రియము
దాహృతం ॥ అచ్యుతాయనమః ॥ అనంతాయనమః ॥ గోవిందాయనమః ॥

ఇ తి మృ త్యుం జ య వి ధా న మ్.

* అథనవగ్రహపూజావిధిః. *

యాజ్ఞవల్క్యః ॥ శ్రీకామశ్శాంతికామోవాగ్రహయజ్ఞంసమాచరేత్। వృష్ట్యాయుఃపుష్టికామోవాతథైవాభిచరన్నపి ॥ సూర్యస్సోమోమహీపుత్రస్సోమపుత్రోబృహస్పతిః। శుక్రశ్శనైశ్చరోరాహుఃకేతుశ్చేతిగ్రహాస్స్మృతాః॥ తామ్రకాత్స్ఫటికాద్రక్తచందనాత్స్వర్ణకాదుభౌ। రాజతాదయసస్సీసాత్కాంస్యాత్కార్యాగ్రహాఃక్రమాత్ ॥ స్వవర్ణైర్వాపటేలేఖ్యాగంధైర్మండలకేషువా । యథావర్ణంప్రదేయానివాసాంసికుసుమానిచ ॥ గంధాశ్చబలయశ్చైవధూపోదేయశ్చగుగ్గులుః । కర్తవ్యోమంత్రవంతశ్చచరవఃప్రతిదైవతం॥ ఆసత్యేనఇమందేవాఅగ్నిర్మూర్ధాదివఃకకుత్। ఉద్బుధ్యస్వేతిచఋచోయథాసంఖ్యంప్రకీర్తితాః ॥ బృహస్పతేఅతియదర్యస్తథైవాన్నాత్పరిస్రుతః। శంనోదేవీస్తథాకాండాత్కేతుంకృణ్వన్నిమాస్తథా ॥ అర్కఃపలాశఃఖదిరఅపామార్గోఽథపిప్పలః। ఉదుంబరశ్శమీదూర్వాఃకుశాశ్చసమిధఃక్రమాత్ ॥ ఏకైకస్యత్వష్టశతమష్టావింశతిరేవవా। హోతవ్యామధుసర్పిర్భ్యాందధ్నాక్షీరేణవాయుతాః ॥ గుడౌదనంపాయసంచహవిష్యంక్షీరషాష్టికం। దధ్యోదనంహవిశ్చూర్ణంమాంసంచిత్రాన్నమేవచ॥ దద్యాద్గ్రహక్రమాదేవవిప్రేభ్యోభోజనంబుధః। శక్తితోవాయథాలాభంసత్కృత్యవిధిపూర్వకం ॥ ధేనుశ్శంఖస్తథానడ్వాన్హేమవాసోహయఃక్రమాత్। కృష్ణాగౌరాయసశ్ఛాగఏతావైదక్షిణాస్స్మృతాః ॥ యశ్చయస్యయదాదుస్స్థస్సతంయత్నేనపూజయేత్ । బ్రహ్మణైషాంవరోదత్తః పూజితాఃపూజయిష్యథ॥

విజ్ఞానేశ్వరః॥ ఏతేసూర్యాదయోనవగ్రహాఃపూజ్యాఇత్యుక్తం।కింకృత్వేత్యతఆహ। తామ్రకాదితి। సూర్యాదీనాంమూర్తయస్తామ్రాదిభిర్యథాక్రమంకార్యాస్తదలాభేస్వవర్ణైఃపటేలేఖ్యాః। మండలేషువాగంధైరక్తచందనాదిభిర్యథావర్ణంలేఖ్యాఇత్యన్వయః । ద్విభుజత్వాదివిశేషస్తుమత్స్యపురాణోక్తోద్రష్టవ్యః । తద్యథా । పద్మాసనఃపద్మకరఃపద్మగర్భసమద్యుతిః। సప్తాశ్వరథసంస్థోపిద్విభుజస్స్యాత్సదారవిః। శ్వేతశ్శ్వేతాంబరధ

రోదశాశ్వశ్శ్వేతభూషణః । గదాపాణిర్ద్విబాహుశ్చ కర్తవ్యో వరదశ్శశీ। రక్తమాల్యాంబరధరశ్శక్తిశూలగదాధరః । చతుర్భుజో మేషగమో వరదస్స్యాద్ధరాసుతః । పీతమాల్యాంబరధరః కర్ణికారసమద్యుతిః। ఖడ్గచర్మగదాపాణిస్సింహస్థో వరదో బుధః । దేవదైత్యగురూ తద్వత్ పీతశ్వేతౌ చతుర్భుజౌ । దండినౌ వరదౌ కార్యౌ సాక్షసూత్రకమండలూ । ఇంద్రనీలద్యుతిశ్శూలీ వరదో గృధ్రవాహనః। బాణబాణాసనధరః కర్తవ్యోర్కసుతస్సదా కరాళవదనః ఖడ్గచర్మశూలీ వరప్రదః । నీలస్సింహాసనస్థశ్చ రాహురత్ర ప్రశస్యతే। ధూమ్రా ద్విబాహవస్సర్వే గదినో వికృతాననాః । గృధ్రాసనగతా నిత్యం కేతవస్స్యుర్వరప్రదాః । సర్వే కిరీటినః కార్యా గ్రహా లోకహితావహాః। స్వాంగులేనోచ్ఛ్రితాస్సర్వే శతమష్టోత్తరం సదేతి । ఏతేషాం స్థాపనదేశశ్చ తత్రైవోక్తః। మధ్యే తు భాస్కరం విద్యాల్లోహితం దక్షిణేన తు। ఉత్తరేణ గురుం విద్యాద్బుధం పూర్వోత్తరేణ తు। పూర్వేణ భార్గవం విద్యాత్సోమం దక్షిణపూర్వతః । పశ్చిమేన శనిం విద్యాద్రాహుం దక్షిణపశ్చిమే । పశ్చిమోత్తరతః కేతుం స్థాపయేచ్ఛుక్లతండులైరితి॥ ఇతి నవగ్రహపూజావిధిః.

## * అథాగ్నిముఖం. *

హరిః ఓం। అథ కర్తా స్వాచాంతో వ్యసిగ్రుహ్యం తేఅథ గార్హ్యాణి కర్మాణి ప్రాఙ్ముఖో విధ్యుపవీతీ దర్భేష్వాసీనో దర్భాన్ ధారయమాణః పవిత్రపాణిః పత్న్యా సహ । ప్రాణానాయమ్య దేశకాలౌ సంకీర్త్య ముకం కర్మ కరిష్య ఇతి సంకల్ప్య। ఉపలిప్య ఉద్ధేశే శ్వేతతండులచూర్ణేన ప్రాదేశమాత్రం స్థండిలం చతురశ్రం మండలం వా కల్పయిత్వా। దర్భాభ్యాం దర్భాభ్యాముల్లిఖ్య। ప్రాచీః పూర్వముపక్రమం దక్షిణారంభమాలిఖేత్ । అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభమాలిఖేత్ ॥ అపాం కర్తారో భ్యుక్ష్య నిధాయ హస్తమభిమృశ్య ప్రోక్షణతోయశేషం । పంక్తోయ సున్యన్నిరధాత్యుదగ్వా యథా బహిస్స్యాచ్ఛపరిస్తరాణాం । భూర్భువస్సువరోమిత్యగ్నిం ప్రతిష్ఠాప్య ప్రోక్షణశేషతోయం ప్రాగుదగ్వోత్సిచ్య అన్యదుదకమానీయ యథా పరిస్తరణాద్బహిః ప్రాగుదగ్వా నిధాయ ప్రాగ్న్యాసాయన పాత్రయోరక్షతోదకం నినీయాగ్ని

విధ్యా । ఓం చత్వారిశృంగాత్రయో అస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తాసో అస్య । త్రిధాబద్ధోవృషభోరోరవీతి మహోదేవో మర్త్యాగ్ంఆవివేశ । అగ్నింధ్యాయామి । సప్తహస్తశ్చతుశ్శృంగస్సప్తజిహ్వోద్విశీర్షకః । త్రిపాత్ప్రసన్న వదనస్సుఖాసీనశ్శుచిస్మితః । స్వాహాంతుదక్షిణేపార్శ్వే దేవీంవామేస్వధాంతథా । బిభ్రద్దక్షిణహస్తైస్తుశక్తిమన్నంస్రుచంస్రువం । తోమరంవ్యజనంవామైర్ఘృతపాత్రంచధారయన్ । మేషారూఢోజటాబద్ధంగౌరవర్ణంమహౌజసం । ధూమధ్వజంలోహితాక్షంసప్తార్చిస్సర్వకామదం । ఆత్మాభిముఖమాసీనమేవంధ్యాయేద్ధుతాశనం । ఏషహిదేవఃప్రదిశోనుసర్వాః పూర్వోహిజాతస్సఉగర్భే అంతః । సవిజాయమానస్సజనిష్యమాణఃప్రత్యఙ్ముఖాస్తిష్ఠతివిశ్వతోముఖః । ప్రాఙ్ముఖాగ్నేమమాభిముఖోభవ । సుముఖోభవ । సుప్రసన్నోభవ । వరదోభవ । ఓంభూర్భువ—త్ । సోదకేనపాణినాప్రదక్షిణమగ్నిం పరిసమూహ్య । అలంకృత్య । అగ్నయేనమః । హుతవహాయనమః । హుతాశనేనమః । కృష్ణవర్త్మనేనమః । దేవముఖాయనమః । సప్తజిహ్వాయనమః । వైశ్వానరాయనమః । జాతవేదసేనమః । ప్రాగుదగగ్రైర్దర్భైరగ్నింపరిస్తృణాతి । దక్షిణానుత్తరాన్కరోతి ఉత్తరానధరాన్ । ఉత్తరేణాగ్నింప్రాగగ్రాన్దర్భాన్సంస్తీర్య । ద్వంద్వంన్యంచిపాత్రాణిప్రయునక్తి । దర్వీమాజ్యస్థాలీంప్రోక్షణీముపవేషమిధ్మం । అప్రచ్ఛిన్నాగ్రావనంతర్గర్భౌదర్భౌప్రాదేశమాత్రౌపవిత్రేకురుతే । తృణం కాష్ఠంవాంతర్ధాయఛినత్తి । ననఖేన । అపఉపస్పృశ్య । ఉద్ధృత్యాపఃప్రోక్షణీమవదాయప్రోక్ష్య । తస్యామపఆసిచ్య । హస్తయోరంగుష్ఠోపకనిష్ఠికాభ్యాముదగగ్రేగృహీత్వాపవిత్రేత్రిరుత్పూయాభిమంత్ర్య । ఉత్తానానిపాత్రాణికృత్వా విస్రస్యేధ్మంత్రిఃప్రోక్ష్య । శేషంనినీయ । తత్పాత్రందక్షిణతోనిధాయ । తేపవిత్రేపూర్ణపాత్రేనిధాయ । పూర్ణపాత్రమాదాయపూర్వవత్కృత్వా । సముంప్రాగగ్రేకృత్వా । ఉత్తరేణాగ్నిందర్భేషుసాదయిత్వా । దర్భైఃప్రచ్ఛాద్య । బ్రహ్మార్థేదక్షిణతోగ్నేర్బ్రాహ్మణందర్భేషూపవేశ్య (బ్రహ్మణేతపఖావేబ్రహ్మేయతనే ।) అస్మిన్కర్మణి త్వంబ్రహ్మాభవ । బ్రహ్మాస్మి

ప్ర్యేనసమస్తేబ్రహ్మన్ప్రోక్ష్యాసి। ఇతి బ్రహ్మోక్షనంకృత్వా తేపవిత్రే ఆజ్యపాత్రే నిధాయ। ఆజ్యంవిలాప్య। అపరేణాగ్నింపవిత్రాంతర్హితాయామాజ్య స్థాల్యామాజ్యంనిరూప్య। ఉదీచోంగారాన్నిరూహ్య। తేష్వధిశ్రిత్య। జ్వల తాతృణేనావద్యోగామిన్యాప్యాగ్నౌప్రాస్యఫలీకృత్య। ద్వేదర్భాగ్రేప్రఛ్ఛిద్యప్ర క్షాళ్యప్రత్యస్యాపఉపస్పృశ్యతేనాసహపర్యగ్నికృత్వా। ఉదగుద్వా స్య। అంగారాన్ప్రత్యూహ్యోదగగ్రాభ్యాంపవిత్రాభ్యాంపునరాహారమా జ్యంత్రిరుత్పూయపవిత్రేగ్రంథింవిస్రస్యాద్భిఃసంస్పృశ్య।ప్రాగగ్రమగ్నౌపవిత్రేప్ర నుప్రహరతి।దర్భైస్సహస్రువంతూష్ణీంసహస్తేనాదాయ।వామేనజుహూంయు గపత్ప్రతితప్య। వామస్త్రికానామికాసంఘేనజుహూంగృహీత్వా। తస్యాః పరిస్రవమంతరతోభ్యాకారంసవ్యతోబిలమశేసమాహారంమూలాద్దండమితి స్రుక్త్రయమేణధారయిత్వాజుహూమగ్రేంతరతోభ్యాకారంప్రాచీమ గ్రైర్బాహ్యతఃప్రతీచీంమూలైర్దండమితిక్రమేణ స్రువస్థాగ్రైరేవసంమృజ్య। నసంమృష్టమసంమృష్టనసన్స్పృశ్యయతి। పునఃప్రతితప్య। ప్రోక్ష్య। ని ధాయ। దర్భానద్భిస్సంస్పృశ్యాగ్నౌప్రహరతి। ఇధ్మమాదాయపరిధీ న్పరిదదాతి। స్థవిష్ఠోమధ్యమఃఅణీయాన్ద్రాఘీయాన్దక్షిణార్ధ్యః। అణిష్ఠో హ్రసిష్ఠఉత్తరార్ధ్యః। ఉదగగ్రంమధ్యమం। ప్రాగగ్రావితరౌ।మధ్యమం పరిధిముపస్పృశ్య। పురస్తాదూర్ధ్వేద్వేఆఘారసమిధావాదధాతి। అగ్నింప రిషించతి। అదితేనుమన్యస్వేతిదక్షిణతఃప్రాచీనమనుమతేనుమన్యస్వేతిప శ్చాదుదీచీనగ్ం సరస్వతేనుమన్యస్వేత్యుత్తరతఃప్రాచీనందేవసవితఃప్రసు వేతిసమంతంఇధ్మమలంకృత్య। స్రువమలంకృత్య। బ్రహ్మాణమలంకృత్య। ఇ ధ్మంద్విరభిఘార్య। స్రుచాలమధ్యమయోస్సంధ్యనాగంకృత్వా। అస్మిన్హోమా మకర్మణిబ్రహ్మన్ఇధ్మమాధాస్యే। అథతేనాభ్యనుజ్ఞాతఉపవిశ్య। హస్తా భ్యాంతూష్ణీమిధ్మమాదధాతి। ప్రజాపతయఇదం। ఇధ్మప్రక్షేపణముహూ ర్తస్సుముహూర్తోస్తు। ఆఘారావాఘారయతిదర్శపూర్ణమాసవత్తూ ష్ణీం। ఇతరదర్భమాదాయ ఉత్తరపరిధిసంధిమన్వవహృత్యప్రజాపతింమ నసాధ్యాయన్దక్షిణతఃప్రాంచమృజుగ్ంసంతతమాఘారయతి వాయు

వ్యాదాగ్నేయాంతం ప్రజాపతయ ఇదం । ప్రథానదర్వీషూరాయ ద్వితీ
యమైంద్రమితరపరిధిసంధిషున్యవహృత్య స్రోగ్రేణ కం । పూర్వవదాఘా
రయతి। నైరుత్యాదీశానాంతం। ఇంద్రాయేదం। ఏకం। ద్వే। త్రీణి। చత్వా
రి । అథాజ్యభాగౌ స్రుచాజుహోతి । అగ్నయే స్వాహేత్యుత్తరార్ధ
పూర్వార్ధే। అగ్నయ ఇదం । సోమాయ స్వాహేతి దక్షిణార్ధపూర్వా
ర్ధే సోమాయేదం। సమంపూర్వేణ । మధ్యేగ్నౌ జుహోతి యథోపదేశం
ప్రధానాహుతీర్జుహోతి। ఆకృష్ణేన...నివేశయన్ స్వాహా। సూర్యగ్రహాయే
దం । అగ్నిం దూతం...సుక్రతున్ స్వాహా । అగ్నయ ఇదం । కద్రుద్రా
య...హృదే స్వాహా। రుద్రాయేదం। ఆప్యాయస్వ...సంగథే స్వాహా।
చంద్రగ్రహాయేదం । అప్సు మే భేషజీ స్వాహా। అద్భ్య ఇదం । గౌరీమిమా
య...పరమే వ్యోమన్ స్వాహా । గౌర్యా ఇదం । అగ్నిర్మూర్ధా...జిన్వతి
స్వాహా। అంగారకగ్రహాయేదం। స్యోనా పృథివి...సప్రథా స్వాహా। పృథి
వ్యా ఇదం। క్షేత్రస్య పతినా...కృశే స్వాహా। క్షేత్రపాలకాయేదం। ఉద్బుధ్య
స్వాగ్నే.....మేనగ్ స్వాహా। బుధగ్రహాయేదం। ఇదం విష్ణు.....సురే
స్వాహా। విష్ణవ ఇదం। సహస్రశీర్షా.. ప్రదశాంగులమ్ స్వాహా। నారాయణా
యేదం। బృహస్పతే...చిత్రగ్ స్వాహా। బృహస్పతిగ్రహాయేదం। బ్రహ్మజ
జ్ఞానం...వివస్స్వాహా। బ్రహ్మణ ఇదం। ఇంద్రం వో విశ్వ...కేవలస్స్వాహా।
ఇంద్రాయేదం। శుక్రం తే అన్యత్...రస్తు స్వాహా। శుక్రగ్రహాయేదం। ఇం
ద్రాణీమాసు...పతిస్స్వాహా। ఇంద్రాణ్యా ఇదం । ఇంద్ర మరుత్వ...య
జ్ఞా స్వాహా। ఇంద్రమరుత్వత ఇదం॥ శమగ్నిరగ్నిభిః...శ్రిధస్స్వాహా । శనై
శ్చరగ్రహాయేదం। యమాయ...అరంకృత స్వాహా। యమాయేదం। ప్రజా
పతే...రయీణాగ్ స్వాహా। ప్రజాపతయ ఇదం। కయానశ్చిత్ర ..శచిష్ఠయా
వృతా స్వాహా। రాహుగ్రహాయేదం। ఆయంగౌః ..ప్రియంతస్సువస్స్వాహా
గవ ఇదం। నమో అస్తు...సర్పేభ్యో నమస్స్వాహా। సర్పేభ్య ఇదం। కేతుం
కృణ్వన్...రజాయథాః స్వాహా । కేతుగణాయేదం। సచిత్రచిత్రం...దువ
స్వ స్వాహా । చిత్రగుప్తాయేదం । బ్రహ్మా దేవానాం...రేభన్ త్స్వాహా। బ్ర

